

# శ్రీనివాస కల్యాణం



## త్రిమూర్తులకు పరీక్ష

శ్రీనివాసుడు అంటే శ్రీవేంకటేశ్వర స్వామి. ఆయనే శ్రీమహావిష్ణువు. ఆయన ఉండేది వైకుంఠంలో. వైకుంఠ మందిరాన్ని వదిలి పెట్టి ఆయన భూలోకానికి దిగివచ్చేశాడు. శ్రీనివాసుడు అనే పేరుతో తిరుమల క్షేత్రంలో ఉండిపోయాడు. విష్ణువు భూలోకానికి రావడానికి కారణమైన గాథ ఒకటి ఉంది...

అవి ద్వాపరయుగం ముగిసిపోయి, కలియుగం ప్రారంభమైన రోజులు. కలియుగంలో అధర్మం పెచ్చుపెరిగి సుఖశాంతులు లోపించిపోతాయని భయపడ్డారు మహర్షులు. సుఖసంతోషాలతో అందరూ సహజీవనం సాగించాలన్న కోరికతో మహర్షులు విశ్వశాంతికోసం ఒక విశేషయాగం ప్రారంభించారు. ఆ విశేష క్రతువుకు కశ్యప మహర్షి ఆధ్వర్యం వహించాడు. గంగానదీ తీరంలో సాగుతున్న ఆ క్రతువులో మహర్షులు వేదమంత్రాలతో హవిస్సులను అగ్నికుండంలో పేల్చుతున్నారు. సువాసనలు వెదజల్లుతున్న హోమధూపం యాగశాల ప్రాంగణమంతా వ్యాపించి, ఆకాశం వైపు దూసుకుపోసాగింది.

సరిగ్గా సమయానికి లోకసంచారం చేస్తూ అక్కడికి వచ్చాడు నారద మహర్షి. కశ్యపుడు, భృగువు, మొదలైన మహర్షులను నారదుడు పలకరించాడు. ''ఏ సంకల్పంతో యజ్ఞం చేస్తున్నారు?'' అని ప్రశ్నించాడు నారదుడు. ''ఇది విశ్వశాంతి కోరి చేస్తున్న విశేష క్రతువు'' అన్నారు మహర్షులు. ''ఆశయం గొప్పదే కానీ మీరు యాగంలో అర్పించే హవిస్సులను నైవేద్యంగా స్వీకరించడానికి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో ఎవరిని ఆహ్వానించార''ని అడిగాడు. నారదుడు.

వక్కంతం సూర్యనారాయణ రావు





''ప్రత్యేకంగా ఎవ్వరినీ ఆహ్వానించలేదు. యాగం పూర్తయ్యేసరికి త్రిమూర్తులలో ఎవరో ఒకరు వస్తారు, యజ్ఞఫలం స్వీకరిస్తారు!'' అన్నారు రుషులు.

రుషుల అమాయకత్వం చూసి నవ్వుకున్న నారదుడు, ''చూశారా! కలియుగ ప్రభావం అప్పుడే మీమీద పనిచేస్తోంది. భక్తితో ఆహ్వానించకపోతే, త్రిమూర్తులలో ఎవ్వరూ రారు! పిలవని పేరంటానికి ఎవరైనా వస్తారా, చెప్పండి!'' అన్నాడు. త్రిమూర్తులు ముగ్గురూ తమకు కావలసిన వాళ్లే. వాళ్లలో ఎవర్ని ఆహ్వానించాలా అనే ఆలోచనలో పడ్డారు మహర్షులు.

''యాగఫలం అందుకునే అర్హత అందరికీ ఉండదు. ఆవేశకావేషాలూ, కోపతాపాలూ లేని శుద్ధ సత్వ స్వరూపుడూ, దేవతలతో మహా ఉత్తముడూ అయిన దేవుడే అందుకు తగినవాడు'' అన్నాడు నారదుడు. బ్రహ్మదేవుడే గొప్పవాడు అన్నారు మహర్షులలో కొందరు. ఇంకొందరు విష్ణువే గొప్పదేవుడు అన్నారు. శివుడే గొప్పదైవం అన్నారు మరికొందరు. ఈ అభిప్రాయభేదాలు మహర్షులలో వాదులాటకు దారితీశాయి. వాదులాట సిగపట్ల దాకా వెళ్లింది.

నారదుడు మహర్షులను వారించాడు. ''మీలో మీరు కలహించుకోవడం దేనికి? ఎవరో ఒకరు వెళ్లి త్రిమూర్తులను పరీక్షించి శుద్ధ సాత్విక దైవం ఎవరో తేల్చుకుంటే సరిపోతుంది కద!'' అన్నాడు.

నారదుని సూచన మహర్షులందరికీ నచ్చింది. త్రిమూర్తులను పరీక్షించడానికి ఎవరు వెళ్లాలా అనే విషయంలో వాళ్లమధ్య మళ్లీ భేదాభిప్రాయాలు తలెత్తాయి. నారదుడు మళ్లీ కల్పించుకుని ఇలా అన్నాడు. ''బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను పరీక్షించే శక్తి, తెలివీ మీలో భృగు మహర్షికి మాత్రమే ఉన్నాయి. ఆయనను పంపించండి.''

మహర్షులు సరే అన్నారు. త్రిమూర్తులను జాగ్రత్తగా పరీక్షించి, నిగ్గుతేల్చి, ఆ ముగ్గురిలో గొప్పదేవుడెవరో నిర్ణయించి, యజ్ఞఫలాన్ని స్వీకరించి రమ్మని భృగు మహర్షిని పురమాయించారు. భృగు మహర్షి సమ్మతించి బయలుదేరాడు.

భృగు మహర్షి మొట్టమొదట బ్రహ్మదేవుణ్ణి పరీక్షించాలని తలిచాడు. మేరు పర్వత శిఖరం మీద ఉన్న సత్యలోకం చేరు

కున్నాడు. ఆయన వెళ్లే సమయానికి వికసించిన తామరపువ్వు మీద కూచున్న బ్రహ్మదేవుడు తన నాలుగు ముఖాలతో తదేక ధ్యాసతో వేదపఠనం చేస్తున్నాడు. ఆయన పక్కనే శ్వేతపద్మం మీద కూచున్న సరస్వతీ దేవి వేదపఠనకు అనుగుణంగా వీణ వాయిస్తోంది. భృగుమహర్షి సరస్వతీ బ్రహ్మలను స్తోత్రం చేస్తూ వాళ్ల కమలాసనాల చుట్టూ ప్రదక్షిణం చేశాడు. భక్తితో ప్రణామాలు అర్పించాడు. అయితే, అరమూసిన కళ్లతో వేదసూక్తాలను పారాయణం చేస్తున్న బ్రహ్మ, తన్మయత్వంలో వీణ మీటుతున్న సరస్వతీ, భృగుమహర్షి రాకను గుర్తించనేలేదు. ఆయన వైపు కన్నెత్తి చూడలేదు. భృగుమహర్షిలో కోపం కట్టలు తెంచుకుంది. భక్తి ఆగ్రహంగా మారిపోయింది. బ్రహ్మదేవుడికి లోకంలో ఆలయమూ, అర్చనా లేకుండా ఉండేలా శపించి, వెనుదిరిగి వెళ్లిపోయాడు. బ్రహ్మ భృగువు శాపం గురించి పట్టించుకోకుండా తన వేద పఠనంలో నిమగ్నుడై ఉండిపోయాడు...

సత్యలోకం నుండీ భృగుమహర్షి తిన్నగా కైలాసం చేరుకున్నాడు. ఆయన వెళ్లే సమయానికి కైలాస మందిరంలో పార్వతీ పరమేశ్వరులు ప్రణయతాండవం చేస్తూ మైమరిచి ఉన్నారు. భృగు మహర్షి బిగ్గరగా శివుడిని స్తుతించాడు. పరమశివుని చేతిలో ఢమరుకం సమ్మోహనకరంగా మోగుతోంది. పార్వతీదేవి కాలి అందెలు ఘల్లు ఘల్లున నినదిస్తున్నాయి. అర్ధాంగితో ప్రణయ తాండవం చేస్తూ పరవశంలో ఉన్న పరమేశ్వరుడి కళ్లకు భృగుమహర్షి కనిపించలేదు. ఎవరినీ చూసే స్థితిలో





లేడు శివుడు! కైలాస మందిరానికి వచ్చిన తనను ఆహ్వానించే బాధ్యతను విస్మరించిన శివుడి ప్రవర్తన భృగుమహర్షిని కంపరమెత్తించింది. పరమశివుడి మూర్తికి కాకుండా లింగరూపానికి మాత్రమే అర్చనలు కలిగేలా ఘోరంగా శపించి, అక్కడినుంచి వెళ్లిపోయాడు.

సత్యలోకంలోనూ, కైలాసంలోనూ తనకు జరిగిన అవమానానికి కోపంతో దహించుకుపోతున్న భృగుమహర్షి చివరి గమ్యమైన వైకుంఠం చేరుకున్నాడు. అక్కడా ఆయనకు నిరాదరణే ఎదురైంది. ఆదిశేషుని పానుపు మీద హాయిగా పవళించిన శ్రీమహావిష్ణువు అర్ధనిమీలిత నేత్రాలతో, యోగనిద్రలో ఉన్నాడు. లక్ష్మీదేవి ఆయన పాదాలను వొత్తుతూ కూచుంది. ఆమె కూడా భృగువు రాకను గమనించలేదు.

వేళకాని వేళలో యోగ నిద్రలో ఉన్న విష్ణువును చూడగానే, భృగుమహర్షికి అరికాలి మంట నెత్తికెక్కింది. కోపంలో వివశుడైపోయిన భృగుమహర్షి ఉచితానుచితాలు పూర్తిగా మరిచిపోయాడు. దూకుడుగా ముందుకు వెళ్లి, కాలు పైకెత్తి శ్రీమహావిష్ణువు వక్షస్థలం మీద ఒక్క తాపు తన్నాడు. విష్ణువు దిగ్గున లేచి కూచున్నాడు. శ్రీమహాలక్ష్మి నివ్వెరపాటుతో బొమ్మలా ఉండిపోయింది.

విష్ణువు ఉలిక్కిపడి, యోగనిద్రనుండీ లేచి కూర్చున్నాడు. ఎదురుగా నిప్పులు కక్కుతూ ఊగిపోతున్న భృగుమహర్షిని చూసి పరిస్థితి గ్రహించాడు. శేషశయ్యనుంచి కిందికి దిగి వినయంగా నమస్కరించాడు. భృగు మహర్షికి స్వాగత వచనాలు పలికి, సగౌరవంగా ఉన్నతాసనం మీద ఆయనను ఆసీనుడిని చేశాడు. అనంతరం రెండు చేతులతో ఆయన పాదాలు ఒత్తుతూ ఇలా అన్నాడు.

''మహానుభావా! నా హృదయం వజ్రం కన్నా ఎనిమిదిరెట్లు కఠినం! దానిని తాకిన మీ పాదం కందిపోయి ఉంటుంది! ఏదీ చూద్దాం...'' అంటూ భృగుమహర్షితో వినయంగా మాట్లాడుతూ శ్రీమహావిష్ణువు ఆయన పాదాలను కడిగాడు. పాదాలను సున్నితంగా తడుముతూ, అరికాల్లో ఉన్న మూడవకంటిని గిల్లివేశాడు.

భృగుమహర్షి అహంకారానికి కారణం ఆయన పాదంలోని మూడవ కన్ను! శ్రీమహావిష్ణువు తెలివిగా ఆ కంటిని గిల్లివేయగానే భృగువు అహంకారం

అంతరించింది. అతనికి జ్ఞానోదయం అయింది. శ్రీహరిని వక్షం మీద తన్ని తాను ఎంత అపరాధం చేశాడో తెలిసి వచ్చింది. విష్ణువు పాదాలమీద వాలి, క్షమించమని వేడుకున్నాడు.

''నేను సకల ప్రాణులకు తండ్రిని. చిన్నారి కుమారుడు తన్నినంత మాత్రాన తండ్రికి కోపం వస్తుందా?'' అన్నాడు విష్ణువు. దానితో శ్రీమహావిష్ణువు ఆగ్రహాలూ, ఆవేశాలూ లేని శుద్ధ సాత్విక స్వరూపుడైన దేవుడుగా గ్రహించాడు భృగుమహర్షి. విశ్వశాంతి కోసం తాము తలపెట్టిన క్రతువుకు విచ్చేసి, యజ్ఞఫలం స్వీకరించమని విష్ణువును ప్రార్థించాడు. విష్ణువు అంగీకరించి, భృగుమహర్షిని పంపించి వేశాడు.

తన నివాస స్థానమైన విష్ణు హృదయాన్ని తన్ని, అవమానించిన భృగుమహర్షి చర్య పట్ల శ్రీమహాలక్ష్మి అవమానంతో, కోపంతో దహించుకుపోయింది. అలాంటి సమయంలో భృగుమహర్షికి తన నాధుడు చేసిన మర్యాదలూ, సపర్యలూ ఆమెకు మరింత ఆగ్రహాన్ని తెప్పించాయి. భృగుమహర్షి తమ అతిథి అనీ, ఆయనను ఆదరించి అతిథి సత్కారాలు అందచేయడం తమ విధి అని చెప్పి లక్ష్మిని ఓదార్చే ప్రయత్నం చేశాడు విష్ణువు.

''ఆ అహంకారి తన్నింది మీ హృదయాన్ని కాదు. నా నివాసస్థానాన్ని. ఇప్పుడు మీ హృదయం మీది కాదు, నాది. ఆ భృగువు అవమానించింది మిమ్మల్ని కాదు. నన్ను. నాకు అవమానం జరిగిన వైకుంఠంలో నేను క్షణం కూడా ఉండను!'' అంటూ ఆగ్రహించింది లక్ష్మి.

తన అర్ధాంగిని శాంతింప చేయడానికి విష్ణువు శతవిధాలా ప్రయత్నించి. ''సకల ప్రాణులూ మనసంతానమే. నువ్వు తల్లివి. నేను తండ్రిని. భృగువు కూడా నీ బిడ్డడే! తల్లికి కోపం తగదుకదా!'' అన్నాడు.

''నేను రత్నగర్భుడైన సముద్రుడి కుమార్తెను. అవమానాలను సహించని ఆత్మాభిమానం నాది. వైకుంఠంలో ఇక ఉండలేను.'' అంటూ లక్ష్మి అలిగి ఆవేశంలో వెళ్లిపోయింది. – (ఇంకా ఉంది)





# శ్రీనివాస కల్యాణం-2



## వెంకటాద్రిలో విడిది

అలిగి వెళ్లిపోయిన అర్ధాంగలక్ష్మి వియోగాన్ని విష్ణువు భరించలేకపోయాడు. లక్ష్మి లేని వైకుంఠం నీరులేని సరోవరంలా అనిపిస్తోంది ఆయనకు. ఆమె లేని వైకుంఠ మందిరం దీపంలేని గుడిలా మారింది. ఒంటరిగా వైకుంఠంలోకంలో ఉండలేనని నిర్ణయించుకున్న విష్ణువు శ్రీమహాలక్ష్మి కోసం అన్వేషిస్తూ బయలుదేరాడు.

నాథుడి మీద ఆగ్రహంతో మందిరాన్ని వదిలిన శ్రీమహాలక్ష్మి తన పుట్టినిల్లయిన క్షీర సాగరదరికి చేరకుండా, భూలోకానికి దిగి వచ్చింది. నివసించడానికి అనువైన స్థలం కోసం చూస్తూ, ఉత్తర భారతదేశంలోని కరవీరపురం అనే నగరానికి సమీపంలో ఉన్న అరణ్యం చేరుకుంది. పూలమొక్కలతో, పొదరిండ్లతో, రకరకాల ఫలవృక్షాలతో అందంగా ఉన్న అరణ్యం అది. లక్ష్మి ఆ ప్రశాంత వాతావరణంలో తపస్సు చేయసాగింది.

శ్రీమహావిష్ణువు వైకుంఠం నుండి తిన్నగా భూలోకం చేరుకున్నాడు. విశ్రాంతి అనేది లేకుండా లక్ష్మికోసం వెదకుతూ, అనేక ప్రదేశాలు తిరిగి, చిట్టచివరకు శ్రీకాళహస్తి వద్ద ప్రవహించే సువర్ణముఖి నదికి ఉత్తర దిక్కులో ఉన్న వేంకటాచలం అనే పర్వత ప్రాంతం చేరుకున్నాడు.

వైకుంఠలోకాన్ని వీడి భూలోకంలో అడుగుపెట్టగానే ఆయనను ఆకలిదప్పులూ, అలసటా, పీడించడం ప్రారంభించాయి. భూలోకంలో తిరిగి, తిరిగి అలసిపోయిన

**వక్కలంక సూర్యనారాయణ రావు**





విష్ణువు వేంకటాచలం మీద విడిది చేయాలనుకున్నాడు.

కలియుగంలో వేంకటాద్రిగా ప్రసిద్ధి చెందిన ఆ పర్వతం ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క పేరుతో వ్యవహరించబడింది. కృత యుగంలో ఆ పర్వతం పేరు వృషాద్రి. త్రేతా యుగంలో అంజనాద్రి. ద్వాపరయుగంలో శేషాద్రి.. సృష్టి ప్రారంభంలో ఆ పర్వతం పేరు క్రీడాద్రి. వైకుంఠలోకంలో శ్రీమన్నారాయణుడు విహరించే పర్వతం అది. కలి ప్రారంభంలో ఆ వైకుంఠ విహార పర్వతం భూలోకానికి తీసుకురాబడింది. అది ఎందుకు జరిగిందంటే...

బ్రహ్మదేవుడు భూలోకంలో మానవులను సృష్టించాలనుకున్నాడు. అయితే భూలోకం లేదు. సముద్రగర్భంలో మునిగిపోయి ఉంది. దితీ, కశ్యప ప్రజాపతి దంపతుల పుత్రుడైన హిరణ్యాక్షుడనే దైత్యుడు భూగోళాన్ని సాగరగర్భంలో తొక్కి పట్టుకున్నాడు. సముద్రంలోనుంచీ భూగోళాన్ని పైకి లేపి తీసుకువచ్చే శక్తిలేని బ్రహ్మ తన తండ్రి అయిన విష్ణుదేవుని ప్రార్థించాడు.

విష్ణువు శ్వేత వరాహ రూపంలో అవతరించాడు. రెండుకోరలతో తెల్లటి పందిలా ఉన్న తన ఆకారాన్ని పర్వతంలాగా పెంచి, సముద్రంలోకి దూకాడు. భూమండలాన్ని అధీనంలో ఉంచుకున్న హిరణ్యాక్షుడితో భీకరంగా యుద్ధం చేసి, చంపివేశాడు. సమస్త భూ మండలాన్ని తన రెండుకోరల మీద పెట్టుకుని సాగరగర్భంలో నుంచీ పైకి తీసుకువచ్చి, ఒక చోట నిలిపాడు. భూలోకంలో మానవులను సృష్టించమని బ్రహ్మకు చెప్పాడు.

శ్వేత వరాహదేవుడు తాను ఉద్ధరించిన భూమిమీదనే నివసించాలనుకున్నాడు. భూలోకంలో దక్షిణ భారతదేశంలో సువర్ణ ముఖీ నదికి ఉత్తరాన ఉన్న ఒక సామాన్య ప్రాంతం తన నివాసానికి తగినదిగా గుర్తించాడు. విష్ణురూపంలో ఉన్నప్పుడు తన వాహనమైన గరుడుణ్ణి పిలిచి, వైకుంఠంలో ఉన్న క్రీడా పర్వతాన్ని భూమిమీదకు చేర్చమన్నాడు. గరుత్మంతుడు వైకుంఠ క్రీడా పర్వతాన్ని తన మూపు మీద పెట్టుకుని భూమిమీదకు చేరవేశాడు. భూమికి దిగిన శ్వేతవరాహుడు ఆ క్రీడా పర్వతం మీద నివసించడం ప్రారంభించాడు....

లక్ష్మిని అన్వేషిస్తూ విష్ణువు చేరుకున్నది శ్వేతవరాహమూర్తి రాజ్యమైన క్రీడా పర్వత ప్రాంతాన్నే. ఆ పర్వతం మీద అనేక జాతుల వృక్షాలున్నాయి. పూలమొక్కలున్నాయి. పొదరిండ్లున్నాయి. స్వచ్ఛమైన జలంతో నిండిన పావనమైన పుష్కరిణి కూడా ఉంది.

పుష్కరిణి అనబడే ఆ కోనేరు సమీపంలో విడిది చేయాలనుకున్నాడు విష్ణువు.

నివసించడానికి తగిన స్థలం కోసం వెదికిన శ్రీమహావిష్ణువుకు పుష్కరిణి పడమటి గట్టుమీద చింతచెట్టు కింద ఎత్తైన పుట్ట కనిపించింది. పెద్ద జంతువులు కూడా దూరిపోగలిగినంత పెద్ద పెద్ద రంధ్రాలున్నాయి ఆ పుట్టకు. ఆ పుట్టనే మందిరంగా భావించి, అందులో నివసించాలనుకున్నాడు విష్ణువు. అనుకున్నదే తడవుగా ఒక విశాలమైన రంధ్రంగుండా పుట్టలో ప్రవేశించి, లోపల విశ్రాంతిగా కూర్చుండిపోయాడు...



లక్ష్మీ, విష్ణువూ ఇద్దరూ వెళ్లిపోయిన కారణంగా వైకుంఠం బోసిపోయింది. నారదుడు ఆ విషయాన్ని తన జనకుడైన బ్రహ్మకు చెప్పాడు. శ్రీమహాలక్ష్మి భూలోకంలో కరివీరపుర సమీపాన అరణ్యంలో తపస్సు చేస్తూ ఉన్నట్టూ, శ్రీమహావిష్ణువు దక్షిణ భారతంలో వేంకటాచలం మీద పుట్టలో నివాసం చేస్తున్నట్టూ యోగదృష్టితో దర్శించాడు బ్రహ్మదేవుడు. పుట్టలో దాగిన తన తండ్రి విష్ణువు ఆకలితో అలమటిస్తున్నాడని అన్నాడు బ్రహ్మ నారదుడితో.

''శ్రీహరికి ఆకలిబాధా!'' అన్నాడు నారదుడు ఆశ్చర్యంతో.

''భూలోకం ప్రకృతి సంబంధమైనది. పంచభూతాల ప్రభావం అక్కడ పరిపూర్ణంగా ఉంటుంది. భూవాతావరణంలోకి అడుగుపెట్టగానే ఆకలిదప్పులూ, అలసటా, ఆవేదనా సహజ లక్షణాలుగా సంక్రమిస్తాయి కుమారా!'' అన్నాడు బ్రహ్మ నారదుడి సందేహాన్ని నివృత్తి చేస్తూ.

''అయితే శ్రీమన్నారాయణుని ఆకలి తీరేది ఎలా?'' అన్నాడు నారదుడు.

''పరమశివుడూ, నేనూ, నువ్వూ, శ్రీమహాలక్ష్మీ కలిసి తరుణోపాయం ఆలోచించాలి. పరమశివుడితో కలిసి, నేడే కరవీరపుర అరణ్యానికి వెళ్దాం!'' అన్నాడు బ్రహ్మదేవుడు...

అనుకున్నట్టే బ్రహ్మదేవుడూ, శివుడూ, నారదుడూ లక్ష్మిని కలుసుకున్నారు. ఆమె కోసం అన్వేషిస్తూ వెళ్ళిన శ్రీమహావిష్ణువు వేంకటాద్రి మీద పుట్టలో చేరి ఆకలితో అలమటిస్తున్న విషయాన్ని ఆమెకు వివరించారు.

''నాథుడి ఆకలి తీరడానికి ఏం చేయాలో చెప్పండి,'' అంది లక్ష్మి.

''సృష్టిలో పాలు సంపూర్ణాహారం. పుట్టలో ఉన్న పురుషోత్తముడికి ప్రతిపూటా పుష్కలంగా పాలు అందించాలి,'' అన్నాడు బ్రహ్మదేవుడు. ''పాలు కావాలంటే పాడి

పశువూ, దూడా అవసరం కద!'' శివుడు సందేహం వెలిబుచ్చాడు.

''మా జనకులు బ్రహ్మదేవులు పాడి ఆవుగా, మీరు దూడగా మారితే సరి! సమస్య తీరుతుంది!'' అన్నాడు నారదుడు.

బ్రహ్మా, శివుడూ అందుకు అంగీకరిం చారు. వేంకటాద్రి సమీపంలో రాజ్యపాలన చేస్తున్న చోళరాజు దివాణంలో పాడి పశు వులు మిక్కుటంగా ఉన్నాయనీ, ఆవుగా మారిన బ్రహ్మను, దూడగా మారిన పరమే శ్వరుడినీ చోళరాజుకు విక్రయిస్తే ఆవూ దూడా అతని ఆలమందలో కలిసి శ్రీహరికి క్షీరం అందించవచ్చనీ ఉపాయం చెప్పాడు నారదుడు. గోపాలక వేషంలో ఆవునూ, దూడనూ చోళరాజుకు విక్రయించడానికి శ్రీలక్ష్మి సమ్మతించింది.

బ్రహ్మ పాడి ఆవుగా మారిపోయాడు. శివుడు దూడగా ప్రత్యక్షమయ్యాడు. లక్ష్మి గోపాలికగా మారిపోయింది. వాళ్లను చోళ రాజు నగరం వైపు మళ్లించి, నారదుడు వెళ్లి పోయాడు.

లక్ష్మి ఆవునూ, దూడనూ తోలుకుని చోళరాజును కలుసుకుంది. తన ఆవు కామ ధేనువులాంటిదనీ, పూటకు కడివెడు పాలు ఇస్తుందనీ, పాడవడమూ, తన్నడమూ తెలియని సాధువనీ వర్ణించి చెప్పింది. ఆవునూ, దూడనూ చూసి చోళరాజు భటుల ద్వారా ఆవుదూడలను గోశాలకు తరలిం చాడు. కామధేనువు లాంటి ఆ ఆవు పాలను నిత్యమూ తన కుమారుడికి త్రాగించాలని ఆజ్ఞాపించాడు.

ఆవూ దూడా కూడా చోళరాజు ఆల మందలో చేరిపోయాయి. అన్ని పశువులతో బాటు గోపాలకుడు ఆ రెండింటినీ మేతకు తోలుకు వెళ్లాడు. ఆలమంద వేంకటాద్రి మీదకు చేరుకుంది. ఆవులన్నీ ఏపుగా పెరిగిన పచ్చికను మేస్తూ ఉండిపోయాయి.

ఆవు రూపంలో ఉన్న బ్రహ్మదేవుడు, విష్ణువు దాగి ఉన్న పుట్టకోసం వెదకసాగాడు. పర్వతం మీద, అరణ్యమంతా వెదకిన అనం తరం పుష్కరిణీ తీరంలోని చాలా పెద్దదైన పుట్టలో విష్ణువు ఉన్నట్లు గ్రహించాడు.

వెంటనే బ్రహ్మగోవు తనపొదుగు నిండుగా చేపిన పాలను ధారాపాతంగా రంధ్రం గుండా పుట్టలోకి వర్షించసాగింది.

విష్ణువు కమ్మటి గోక్షీరాన్ని కడుపారా పానం చేశాడు. ఆయన ఆకలి తీరింది. పొదుగులోని పాలను పూర్తిగా కురిపించిన తరవాత ఆవు ఏమీ ఎరుగనట్లు మందలో కలిసిపోయింది.



# శ్రీనివాస కల్యాణం-3



## శ్వేతవరాహుడు; శ్రీనివాసుడు

రోజులు గడుస్తున్నాయి. గోశాలలో ఉన్నంతసేపూ పొదుగులో పాలను ఎగబట్టడం, వేంకటాద్రికి చేరగానే పుట్టవద్దకెళ్ళి పుట్టలోకి పాలను వర్షించటం ఆవుకు నిత్య కృత్యం అయిపోయింది.

బాల యువరాజుకు కొత్తగా కొన్న ఆవు పాలు పట్టడం లేదన్న సంగతి రాణీగారికి తెలియవచ్చింది. పశువులకాపరి అయిన గొల్లవాడిమీద రాణికి అనుమానం వేసింది. కొత్త ఆవు పాలను గోపాలకుడే దొంగిలించి వేస్తున్నాడన్న నిర్ణయానికి వచ్చి రాణి, అతడిని మందిరానికి పిలిపించి ప్రశ్నించింది.

అమాయకుడైన గోపాలకుడు తనకు ఏ పాపమూ తెలీదన్నాడు. ''ఆవుపాలను నువ్వైనా తాగుతూ ఉండాలి; లేదంటే పూర్తిగా దూడైనా తాగేస్తూ ఉండాలి. నిజం చెప్పు'' అంటూ గద్దించింది రాణి.

గోపాలకుడు కుయ్యోమొర్రో అన్నాడు. 'నేను తాగడంలేదు, పాపం దూడ కూడా తాగడం లేదు. ఆవు దాని పాలను అదే తాగేస్తూ ఉంటుంది, మారాణీ..!'' అన్నాడు.

గోపాలకుడి సమాధానం రాణీగారికి కోపం తెప్పించింది. చర్మంతో చేసిన కొరడాతో గోపాలకుడిని కొట్టించింది. గోపాలకుడి శరీరం నిండా వాతలు పడ్డాయి. గోపాలకుడు బాధతో, అవమానంతో కుమిలిపోయాడు. ఆవు తన పాలను ఎలా మాయం చేస్తోంది కనిపెట్టాలనుకున్నాడు.

తనను వాతలు పడేలా కొట్టించిన ఆవు మీద కోపంతో రగిలిపోతున్న గోపాలకుడు, చరచరా నడవడానికి వీలు లేకుండా ఆవు కాలికీ, మెడకూ తాడుతో బంధంవేసి, మందతోబాటు కొండమీదికి తోలుకెళ్ళాడు. ఏపుగా ఉన్న పచ్చికను మేయకుండా ఆవు నెమ్మదిగా కుంటుతూ పుట్టవైపు దారి తీసింది. గోపాలకుడు చప్పుడు చేయకుండా

పక్కింతం సూర్యనారాయణ రావు



వెంబడించాడు. ఆవు ఎత్తైన పుట్టమీదికి ఎక్కి పొదుగులోంచి పాలను పుట్టరంధ్రంలోకి వదలసాగింది.

పాలను పుట్టపాలు చేస్తున్న ఆవుమీద కోపంతో ఊగిపోయాడు గోపాలకుడు. చేతపట్టుకున్న గండ్రగొడ్డలితో ఆవు తల నరికే ప్రయత్నం చేశాడు. వెంటనే పుట్టలో ఉన్న విష్ణువు వెలికివచ్చి గొడ్డలిదెబ్బ ఆవుకు తగలకుండా తన తలను అడ్డుపెట్టాడు. గోపాలకుడి గండ్రగొడ్డలి దెబ్బ ఆయన తలకు తగిలింది. పెద్ద గాయమై, రక్తం కారసాగింది.

హఠాత్తుగా పుట్టలోనుంచి ప్రత్యక్షమైన దివ్యపురుషుడినీ, తన గొడ్డలి చేసిన గాయం నుంచి కారుతూ కాలువపట్టిన నెత్తురునూ చూసి భీతిల్లిన గోపాలకుడు మరణించి, కిందపడిపోయాడు. విష్ణువు పుట్టలోపలికి వెళ్ళిపోయాడు.

జరిగిన దానిని గమనించిన ఆవు వెనుదిరిగి, మందలోకి వెళ్ళకుండా, చోళరాజు మందిరానికి వెళ్ళింది. ఆయనముందు కన్నీళ్ళు కారుస్తూ, నేలమీదపడి దుఃఖంతో అటూ, ఇటూ దొర్లసాగింది. ఆవు చేష్టలు చూసి, చోళరాజు నివ్వెరపోయాడు. మందను వదలి ఆవు ఒంటరిగా ఎందుకు తిరిగి వచ్చిందో ఆయనకు అర్థంకాలేదు. వెంటనే ఒక చారుణ్ని పిలిపించాడు.

ఆవును లేపి, తోలుకెళ్ళి మందలో కలిపి, గోపాలకుడిని హెచ్చరించి రమ్మని ఆజ్ఞాపించాడు. ఆయన మాటలు అర్థం చేసుకున్నట్లు ఆవు పొర్లడం మాని, లేచి నిలబడింది. ఒకసారి చారుడివైపు చూసి, మందిరంలోంచి అవతలకి అడుగులు వేసింది.



ముందు నడుస్తున్న ఆవు చారుడిని వేంకటాద్రి మీద ఉన్న పుట్ట దగ్గరికి చేర్చింది. చారుడు అక్కడ గోపాలకుడి శవాన్నీ, కాలువ కట్టిన రక్తాన్నీ చూసి నిర్ఘాంతపోయాడు. ఆవును మందవైపు మళ్ళించి, తాను ఇంటి దారిపట్టాడు. మరణించిన గోపాలకుడి గురించీ, రక్త ప్రవాహం గురించీ రాజుకు విన్నవించాడు.

ఆశ్చర్యపోయిన చోళరాజు గోపాలకుడు ఎందుకు మరణించాడో తెలుసుకోవాలనుకున్నాడు. వెంటనే పల్లకీమీద వేంకటాద్రి పుష్కరిణి ప్రాంతం చేరుకున్నాడు.

గోపాలకుడి శవాన్నీ, రక్తాన్నీ చూసి చోళరాజు కోపావేశంతో ఒళ్లు మరిచిపోయాడు. ''ఈ దారుణానికి కారకులు ఎవరు, ఎవరైనా సరే శిక్షించి తీరుతాన''ని అంటూ అరిచాడు. ఆ అరుపులు విని విష్ణువు పుట్టలోనుంచి వెలుపలికి వచ్చాడు. ''గోమాతను చంపబోయిన గోపాలకుడి గొడ్డలిదెబ్బ, నాతలకు తగిలి గాయమైంది. గోపాల



కుడు భయంతో మరణించాడు. వాడు నీ సేవకుడు. నన్ను గాయపరచి అపరాధం చేశాడు. సేవకుడు చేసిన తప్పులకు యజమాని బాధ్యుడు. గోపాలకుడు చేసిన నేరానికి నిన్ను శిక్షిస్తున్నాను. పిశాచివైపో..!'' అంటూ శపించాడు.

ఆయనను విష్ణువుగా తెలుసుకున్న చోళరాజు క్షమాభిక్ష కోరాడు. విష్ణువు శాప విమోచన విధిని వివరించి, వెళ్ళమన్నాడు. చోళరాజు పిశాచిగా మారి అడవులు పట్టుకుని వెళ్ళిపోయాడు.

విష్ణువు గోపాలకుడిని బ్రతికించాడు. గొడ్డలితో కొట్టినందుకు గోపాలకుడు పశ్చాత్తాపం వెలిబుచ్చాడు. విష్ణువు అతడిని క్షమించాడు. భవిష్యత్తులో వేంకటాద్రిమీద అర్చామూర్తిగా ఆలయంలో నెలకొనే తనను ప్రతిరోజూ మొట్టమొదటిసారి దర్శించుకునే అవకాశం అతనికీ, అతని వంశీకులకు తరతరాలు ఉండేలా గోపాలకుడికి వరమిచ్చాడు. గోపాలకుడు ఆయనను స్తుతించి, నగరానికి వెళ్ళిపోయాడు.

విష్ణువు దేవతల గురువైన బృహస్పతిని స్మరించాడు. వెంటనే బృహస్పతి ఆయన ముందు ప్రత్యక్షమయ్యాడు. విష్ణువు తన తలకు తగిలిన గాయాన్ని ఆయనకు చూపించి, తగిన మందును సూచించమని అడిగాడు. ''మేడిచెట్టు పాలతో జిల్లేడు దూదిని తడిపి కట్టు కడుతూ ఉంటే గాయం త్వరగా మానిపోతుందన్నాడు'' బృహస్పతి.

మేడిచెట్టు పాలతో గాయానికి వైద్యం చేసుకుంటూ చింతచెట్టుకింది పుట్టలోనే వాసం చేస్తూ, కాలం గడుపుతూ, లక్ష్మి కోసం పరితపిస్తూ ఉండిపోయాడు విష్ణువు. ఒకనాడు మేడిపాల కోసం పర్వతంమీద వెదుకుతూ తిరుగుతున్నాడు. అదే సమయంలో అటుగా వస్తున్న శ్వేతవరాహమూర్తి కంట బడ్డాడు.

''అమమతి లేకుండా నా రాజ్యంలో సంచరిస్తున్నది ఎవరు?'' అంటూ పెడబొబ్బలు పెట్టాడు శ్వేత వరాహుడు. ఆయనను చూడగానే విష్ణువు పరుగునవెళ్ళి పుట్టలో నక్కి దాక్కున్నాడు. శ్వేత వరాహుడు సమీపానికి వచ్చి, పుట్టలోనుండి వెలుపలికి రమ్మంటూ హుంకరించాడు. విష్ణువు వెలుపలికి వచ్చి శ్వేత వరాహస్వామి ముందు నిలుచున్నాడు. శ్వేతవరాహుడూ, విష్ణువూ చూడగానే ఒకరినొకరు పోల్చుకున్నారు. లక్ష్మి అలిగి వెళ్ళిపోయిన కారణంగా ఆమెను అన్వేషిస్తూ అక్కడికి చేరుకున్నట్టు చెప్పాడు విష్ణువు.

శ్వేతవరాహంగా ఆవిర్భవించి, హిరణ్యాక్షుడిని వధించి, భూమిని ఉద్ధరించిన

నాటినుండీ ఆ పర్వతంమీదనే నివసిస్తు న్నట్లు వివరించాడు శ్వేతవరాహుడు. ఆ పర్వతం శేషాద్రి, గరుడాద్రి, వేంకటాద్రి, నారాయణాద్రి, వృషాద్రి, వృషభాద్రి, అంజనాద్రి అనే సప్తగిరుల సముదాయ మనీ, అదంతా తన సామ్రాజ్యమనీ చెప్పాడు.

తాను భూలోకంలో వేంకటాచలంమీద శ్రీనివాసుడు అనే పేరుతో ఉంటున్నట్లు శ్రీమహావిష్ణువు, శ్వేతవరాహుడితో చెప్పాడు. "శ్వేతవరాహదేవా.. నువ్వు ఎవరోకాదు, నా అంశావతారానివే. కలియుగం పూర్తయ్యే దాకా నేను వేంకటాద్రిమీదనే ఉండాలను కుంటున్నాను. నూరు అడుగుల స్థలం నాకు దానంచేయి" అన్నాడు.

"ప్రతిఫలంగా ధనం లేకుండా స్థలం ఇవ్వను" అని తేల్చి చెప్పాడు శ్వేతవరాహుడు.

"ప్రతిఫలంగా ధనాన్ని మించిన ఐశ్వ ర్యాన్ని ఇస్తాను. భవిష్యత్తులో ఈ పర్వతం మహాక్షేత్రం అవుతుంది. భక్తులు నా దర్శనం కోసం తండోపతండాలుగా ఇక్కడికి వస్తారు. నన్ను దర్శించుకునేందుకు ముందు విధిగా నిన్ను దర్శించి, నీకు క్షీరాభిషేకం చేసి, నైవేద్యం అర్పించే విధంగా నిర్ణయిస్తు న్నాను" అన్నాడు శ్రీనివాసుడు.

శ్వేతవరాహుడు సంతోషంతో అంగీకరిం చాడు. శ్రీనివాసుడు కోరిన విధంగా పుష్క రిణీ తీరంలో నూరు అడుగుల స్థలాన్ని ధారాదత్తం చేశాడు. తన అనుమతితో, తన సామ్రాజ్యంలో నివసిస్తున్న వకుళమాలిక అనే స్త్రీని శ్రీనివాసుడికి వంటకత్తెగా నియ మిస్తానన్నాడు శ్వేతవరాహుడు. ఆయన భోజనం కోసం ప్రతిరోజూ శ్యామధాన్యాన్నీ, తేనెనూ ఇస్తానన్నాడు.

శ్వేత వరాహుడు శ్రీనివాసుడికి వకుళ మాతను పరిచయం చేశాడు. శ్రీనివాసుడిని చూడగానే వకుళమాలికను ఏదో తెలియని ఆనందం ఆవరించింది. శ్రీనివాసుడి దివ్య మంగళ స్వరూపం ఆమెకు పారవశ్యం కలిగిం చింది. సపర్యలు చేస్తూ, చక్కగా వండి పెడుతూ శ్రీనివాసుడిని కన్నబిడ్డలా చూసు కుంటానంది.

వకుళమాలిక వాత్సల్యంతో చేసే ఉప చారాలు శ్రీనివాసుడి మానసిక వేదనను, గాయంమూలంగా కలిగే బాధనూ దూరం చేస్తున్నాయి. వకుళమాలిక క్రమం తప్ప కుండా శ్రీనివాసుడి గాయానికి మేడి పాలతో వైద్యం చేయసాగింది. ఆమె చేతి చలవతో గాయం త్వరగా మానిపోయింది. పర్వతంమీద విహరిస్తూ, శ్రీనివాసుడు హాయిగా కాలం వెళ్ళదీస్తున్నాడు.





# శ్రీనివాస కల్యాణం-4

## పద్మావతీ పరిచయం

వకుళమాలిక శ్రీనివాసుడిని కన్నకొడుకుగా చూసుకొంటోంది. ఆయన ఆహార విహారాల గురించీ, ఆరోగ్యం గురించీ ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తూ అబ్బురపరుస్తోంది. ఆమెను ఒక పరిచారికగా కాకుండా తల్లిగానే చూసుకుంటున్నాడు శ్రీనివాసుడు. శ్రీనివాసుడంటే వకుళమాలికకు ప్రత్యేక ఆప్యాయత. వకుళమాలిక అంటే శ్రీనివాసుడికి ప్రత్యేక అభిమానం. అందుకు కారణం వుంది.

వకుళమాత పూర్వజన్మలో ఎవరో కాదు, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడిని ఆలించి, లాలించి పెంచి పెద్దచేసిన యశోద. యశోదగా ఉన్నప్పుడు శ్రీకృష్ణుడి వివాహాలను చూసే అవకాశం ఆమెకు దక్కలేదు. ''నాయనా, కృష్ణా.. నీ వివాహాన్ని చూసి ఆనందించే అదృష్టం నాకు లేదా..?'' అని అడిగింది యశోద. ''కలియుగంలో వేరొక రూపంలో నేను వివాహం చేసుకుంటాను. ఆ శుభకార్యం నీ చేతులమీదుగా జరుగుతుంది. ఆ అవతారంలో తల్లిలేని నాకు నువ్వు తల్లిగా ఉంటావు'' అన్నాడు కృష్ణుడు. ద్వాపర యుగంలో కృష్ణుడిగా అవతరించిన శ్రీమహావిష్ణువే, కలియుగంలో శ్రీనివాసుడిగా వేంకటాద్రిమీద విడిది చేశాడు. యశోదాదేవి వకుళమాలికగా జన్మించి, ఆయనను చేరుకుంది.

వెంకటాద్రి పర్వతానికి కొంచెం దూరంలో ఉన్న నారాయణపురం రాజధానిగా ఆకాశరాజు పరిపాలన చేస్తున్నాడు. ఆయన రాజ్యం తొండమండలం. ఆకాశరాజు చంద్రవంశానికి చెందిన సుధర్ముడు అనే రాజు కొడుకు. ఆయన భార్య ధరణీదేవి. వివాహం జరిగి చాలాకాలం అయినా ఆకాశరాజు దంపతులకు సంతానం కలుగలేదు.

పిల్లలు పుట్టనందుకు కుమిలిపోతున్న ఆకాశరాజు తన విచారాన్ని రాజగురువు ముందు వెళ్ళబోసుకున్నాడు. సంతతి కలగాలన్న సంకల్పంతో యాగం చేస్తే పుత్రుడు పుట్టే అవకాశం ఉందన్నాడు రాజగురువు. గురువు సూచన ప్రకారం ఆకాశరాజు యాగశాలకు భూమిని సిద్ధం చేయడానికి బంగారు నాగళ్ళతో దున్నసాగేడు. ఆ నేలలో వేయిదళాల పద్మం, ఆ పద్మంలో చిన్నారి బాలికా కనిపించారు. ఆకాశరాజు వెంటనే ఆ బాలికను చేతులలోనికి తీసుకుని, హృదయానికి హత్తుకున్నాడు. బాలికను సాక్షాత్తూ ఆ భగవంతుడే తనకు ప్రసాదించాడనుకున్నాడు.

యాగసన్నాహాలను ఆపివేసి, మందిరానికి వెళ్ళి బాలికను భార్య ధరణీదేవికి అందించాడు. దైవానుగ్రహంతో లభించిన బాలికను తమ కూతురిగానే భావించారు రాజదంపతులు. నికసించిన పద్మంలాంటి ముఖంతో, పద్మదళాలలాంటి విశాల నేత్రాలతో, సహస్రదళపద్మంలో లభించిన ఆ బాలికకు పద్మావతి అని నామకరణం చేశాడు ఆకాశరాజు. పూర్వం త్రేతాయుగంలో జనక మహారాజుకు యాగ భూమిలో సీతాదేవి లభించిన విధంగా తమకు పద్మావతి లభించిందనుకుని ఆనందంతో పొంగిపోయారు రాజదంపతులు.



పద్మావతితోబాటు అదృష్టం రాజదంపతుల జీవితంలో ప్రవేశించింది. పుత్రికామేష్టి యాగం చేయకుండానే మహారాణి ధరణీదేవి గర్భవతి అయ్యింది. నవమాసాలు పూర్తి కాగానే ఆమెకు కొడుకు పుట్టాడు. కుమారుడికి వసుదాసుడు అని పేరు పెట్టాడు ఆకాశరాజు.

పద్మావతీ, వసుదాసుడూ బాల్యాన్ని ఆటపాటలతో గడుపుతూ, ఆకాశరాజు దంపతుల ప్రత్యేక పోషణలో పెరిగి యవ్వనవంతులయ్యారు. అందాలబరిణె అయిన పద్మావతిని తగిన సౌందర్యవంతుడైన వరుడికి ఇచ్చి వివాహం జరిపించాలనుకున్నాడు ఆకాశరాజు.

యుక్త వయస్కురాలైన పద్మావతి చెలికత్తెలతో కలిసి ఆటపాటలతో, బొమ్మల పెండ్లిండ్లతో, ఉద్యానవన విహారాలతో ఉల్లాసంగా కాలం గడుపుతోంది. ఒకనాడు ఉద్యానవనంలో పద్మావతిని కలుసుకున్న నారదుడు ఆమె శరీరంమీద ఉన్న శుభ లక్షణాలను బట్టి దైవ స్వరూపుడు ఆమె భర్త అవుతాడని జోస్యం చెప్పాడు.

పక్కంతం సూర్యనారాయణ రావు



ఒకనాడు శ్రీనివాసుడు వేటకు తగిన వేషం ధరించి, ధనుర్బాణాలు పట్టుకుని, వకుళమాలిక అనుమతితో వేటకు బయలు దేరాడు. క్రూరజంతువులను వెంటాడుతూ, తనకు తెలియకుండానే నారాయణపురం సమీపంలోని అరణ్యప్రాంతం చేరుకున్నాడు. అక్కడ ఒక మదపుటేనుగు ఆయనకు తారసిల్లింది. శ్రీనివాసుడు ఆ ఏనుగును వెంబడించాడు. ఘీంకారాలు చేస్తూ, పరుగెడుతున్న ఆ మదగజం రాజుగారి అంతఃపుర ఉద్యానవనంలోకి వెళ్ళిపోయింది.

సరిగ్గా అదే సమయానికి రాకుమారి పద్మావతి చెలికత్తెలతో కలిసి ఉద్యానవన విహారం చేస్తోంది. ఆడుతూ, పాడుతూ పువ్వులు కోసుకుంటున్న పద్మావతీ ఆమె చెలికత్తెలూ అడవి ఏనుగును చూసి భయపడిపోయారు. గుంపుగా ఒకచెట్టు చాటుకు చేరి ఆందోళనతో కేకలు వేయసాగేరు.

ఏనుగును వెంటాడుతూ వచ్చిన శ్రీనివాసుడు వారి భయాందోళనలను గ్రహించి, మదపుటేనుగును ఉద్యానవనం నుంచి అవతలికి తరిమివేశాడు. ఆయన చూపులు పద్మావతిమీద వాలాయి. అతిలోకసౌందర్యవతి అయిన పద్మావతి తొలిచూపులోనే ఆయన హృదయాన్ని గెలుచుకుంది.

కోయదొర వేషంలో ఉన్న శ్రీనివాసుడిని చూసి పద్మావతీ, చెలికత్తెలూ బెదిరిపోయారు. ''ఇది అంతఃపుర కాంతలు విహరించే అభ్యంతరవనం. పురుషులు రాకూడదు. వెళ్ళిపో..!'' అన్నారు చెలికత్తెలు శ్రీనివాసుడితో.

తొలి చూపులోనే రాకుమారిని వరించాననీ, ఆమెను వివాహం చేసుకుంటాననీ, ఆమె అంగీకారం తెలిపేదాకా వెళ్ళననీ అన్నాడు శ్రీనివాసుడు. రాకుమారి పద్మావతి ముందు అంత ధైర్యంగా మాటలాడుతున్న ఆ కారునలుపు వనవాసి ఎవరో తెలుకోవాలనిపించింది చెలికత్తెలకు. ఎవరో చెప్పమని అతన్ని ప్రశ్నించారు.

''నా పేరు శ్రీనివాసుడు. నాది చంద్రవంశం. వాసిష్టగోత్రం. నా నివాసం వేంకటాచలం. నా మాతృమూర్తి వకుళమాలిక...'' అంటూ తన వివరాలు చెప్పాడు శ్రీనివాసుడు. తనలాగే పేరూ, కులగోత్రాలు చెప్పమని పద్మావతిని అడిగాడు.

పద్మావతి సిగ్గుతో తలవాల్చుకుని ఇలా అంది ''నా పేరు పద్మావతి. ధరణీదేవి నా తల్లి. ఆకాశరాజు నా తండ్రి. మాది అత్రి గోత్రం, చంద్రవంశం...''

ఇద్దరి మాటలూ వింటున్న చెలికత్తెలు భయపడిపోయారు. ఉద్యానవనంలోకి

ప్రవేశించిన విషయం రాజుగారికి తెలిస్తే కఠినంగా శిక్షిస్తాడనీ, వెంటనే వెళ్ళిపొమ్మనీ శ్రీనివాసుడిని హెచ్చరించారు. పద్మావతి సౌందర్యాన్ని చూస్తూ మైమరచిపోయిన శ్రీనివాసుడు చెలికత్తెల మాటలను పట్టించుకోలేదు.

పద్మావతి రెప్పపాటు లేని కళ్ళతో శ్రీనివాసుడినే చూస్తోంది. నీలిమేఘంలాంటి శరీర వర్ణం. ఎత్తయిన భుజాలు. పొడవుగా, మోకాళ్లదాకా ఉన్న అందమైన చేతులు, విశాలమైన వక్షస్థలం. పెద్ద పెద్ద కళ్ళు. చిరునవ్వులు చిందిస్తున్న పెదవులు. శ్రీనివాసుడి సౌందర్యాన్ని చూస్తూ పద్మావతి మైమరచిపోయింది. చెలికత్తెలు పద్మావతి చేతులు పట్టుకుని అంతఃపురంవైపు నడిపించారు. చెలికత్తెల బలవంతంమీద వెళ్తున్న పద్మావతి శ్రీనివాసుడివైపే చూస్తోంది. పద్మావతి కనుమరుగయ్యేదాకా మైమరచి నిలిచి ఉన్న శ్రీనివాసుడు బరువుగా నిట్టూర్చి ఉద్యానవనంలోంచి అవతలికి నడిచాడు.

వేంకటాద్రి మీద ఉన్న తన నివాసానికి చేరుకున్న శ్రీనివాసుడు రాకుమారి పద్మావతి మీద మొలకెత్తిన అనురాగంతో పిచ్చివాడిలా అయిపోయాడు. అన్నమూ, నీళ్ళూ ముట్టకుండా పద్మావతి గురించే ఆలోచిస్తూ ఉండిపోయాడు.

అతని పరధ్యానానికి కారణమేంటో తెలుసుకోవడానికి వకుళమాలిక ప్రయత్నించింది. ఆమె ఎన్ని ప్రశ్నలు వేసినప్పటికీ శ్రీనివాసుడు సమాధానం చెప్పలేదు. చాలాసేపటికి మౌనం వీడి, తన పరధ్యానానికి కారణమేంటో వివరించాడు.

వేటకు వెళ్ళిన తాను మదపుటేనుగును వెంబడిస్తూ, అంతఃపుర ఉద్యానవనం చేరుకున్న సంగతీ, అక్కడ పద్మావతిని చూసి, మనసుపడిన సంగతీ చెప్పాడు శ్రీనివాసుడు. ''పద్మావతి నా మనస్సును పూర్తిగా ఆక్రమించింది. ఆమెను వివాహం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. పద్మావతిని కాకుండా మరొకరిని పెళ్ళి చేసుకోలేను'' అన్నాడు వకుళమాలికతో.

అతని మనసు దోచిన పద్మావతి ఎవరో, ఆమె తల్లిదండ్రులు ఎవరో వివరంగా చెప్పమని అడిగింది వకుళమాలిక.





# శ్రీనివాస కల్యాణం - 5

## ప్రణయ రాయబారం

''పద్మావతి ధరణీదేవి, ఆకాశరాజుల పుత్రిక. నారాయణపురం రాజధానిగా తొండమండలాన్ని ఏలుతున్నాడు ఆకాశ రాజు'' అన్నాడు శ్రీనివాసుడు పద్మావతి గురించి చెబుతూ. పద్మావతిది అలౌకిక సౌందర్యమనీ, ఆమె తనను చేపట్టడానికే జన్మించిందనీ అన్నాడు.

''నీ మనసును దోచుకున్న కన్య సామాన్య కన్య అయి ఉండదనిపిస్తోంది నాయనా.'' అంది వకుళమాలిక.

''గత జన్మలో, అంటే ద్వాపరయుగంకు ముందు గడిచిపోయిన త్రేతాయుగంలో ఆమె నన్ను పరిణయం చేసుకోవాలని కోరింది. అది నా రామావతార సమయం. ఆ అవతారంలో నేను ఏకపత్నీవ్రతుణ్ని. భవిష్యత్తులో వివాహం చేసుకుంటానని అప్పుడు సంకల్పించాను'' అన్నాడు శ్రీనివాసుడు.

పద్మావతి పూర్వజన్మ గాథ వినిపించమని కుతూహలంగా అడిగింది వకుళమాలిక. పూర్వజన్మలో పద్మావతి వేదవతి అనీ, ఆమె వృత్తాంతం వినిపిస్తాననీ చెప్ప సాగేడు..

''పూర్వం కుశధ్వజుడు అనే తపస్వి శ్రీమహాలక్ష్మిని పుత్రికగా పొందాలన్న కోరికతో తపస్సు చేశాడు. లక్ష్మీదేవి అంశ ఆయన పుత్రికగా జన్మించింది. కుశధ్వజుడు ఆ బాలికకు వేదవతి అని నామకరణం చేశాడు. అల్లారుముద్దుగా పెరిగిన వేదవతికి యుక్తవయస్సు వచ్చింది. కుమార్తె వేదవతిని విష్ణుమూర్తికి తప్ప మరెవ్వరికీ భార్యగా ఇవ్వనని వ్రతం పట్టాడు కుశధ్వజుడు. అందాలరాశి అయిన వేదవతిని దంభుడు అనే రాక్షసుడు పెళ్ళాడాలనుకుని కుశధ్వజుణ్ని అడిగాడు. ఆయన తన కుమార్తెను శ్రీహరికి అంకితం చేశానన్నాడు. దంభాసురుడు పగ పెంచుకున్నాడు. ఒకనాటి రాత్రి నిద్రిస్తున్న కుశధ్వజుడిని చంపివేశాడు. ఆ తపస్విని హత్య చేసిన పాపంవల్ల దంభాసురుడు చచ్చిపోయాడు. కుశధ్వజుడి ఇల్లాలు భర్తతో సహగమనం చేసింది.

తల్లిదండ్రులిద్దరినీ పోగొట్టుకున్న వేదవతి, తండ్రి ఆశయం ప్రకారం శ్రీహరిని పెళ్ళాడే సంకల్పంతో తపస్సు చేయసాగింది. హిమాలయ పర్వతప్రాంతంలో విహరిస్తున్న రావణాసురుడు వేదవతిని చూశాడు. తపస్సుమాని, తనను పెళ్ళాడమంటూ బలవంతం చేశాడు. వేదవతి తిరస్కరించింది. ఆమెను బలవంతంగా తీసుకువెళ్ళడానికి చెయ్యి పట్టుకున్నాడు రావణుడు. తనను తాకి అపవిత్రం చేశాడన్న ఆగ్రహంతో వేదవతి ఆత్మార్పణం చేయతలపెట్టింది. యోగాగ్నిని పుట్టించి, అందులో తనను తాను దహనం చేసుకుంది.

యోగాగ్నిలో దేహాన్ని అర్పణ చేసిన వేదవతి అనంతర అవతారంలో ఆకాశరాజుకు పుత్రికగా లభించింది. యుగయుగాలుగా జన్మలెత్తుతూ వేదవతి నన్ను భర్తగా పొందటానికి తపిస్తోంది...'' అంటూ వేదవతి గాథను ముగించాడు శ్రీనివాసుడు.



పద్మావతి పూర్వజన్మ గాథను విన్న వకుళమాలిక హృదయం ఆనందంతో నిండిపోయింది. ''ఆకాశరాజు దంపతులతో సంప్రదించి, పద్మావతితో నీ వివాహం జరిగేలా చూస్తాను'' అని శ్రీనివాసుడికి ధైర్యం చెప్పింది. వెంటనే ప్రయాణమై నారాయణపురం దారిపట్టింది.

వకుళమాలిక వెళ్ళగానే శ్రీనివాసుడు ఆలోచనలో పడ్డాడు. ఆమె ప్రతిపాదనను అంగీకరించడానికి ఆకాశరాజు దంపతులను మానసికంగా సిద్ధం చేయటం అవసరం అనిపించింది ఆయనకు. ఆ పని స్వయంగా తానే చేయాలి. అందుకు తన రూపం పనికిరాదు. రాజదంపతులను నమ్మించగలిగిన రూపంలో వెళ్ళాలి. ఆలోచిస్తున్న శ్రీనివాసుడికి సోదెకత్తె

వక్కలంకం సూర్యనారాయణ రావు

రూపంలో వెళ్తే కార్యం జయప్రదమవుతుందని తోచింది. ఆలోచన కలిగిన ఆ క్షణంలోనే శ్రీనివాసుడు సోదెకత్తెగా మారిపోయాడు.

బ్రహ్మదేవుడిని చంటిపిల్లవాడుగా చేసి, చంకనెత్తుకున్నాడు. పరమశివుడిని మంత్రదండంగా చేసి, చేత్తో పట్టుకున్నాడు. గురివెంద పూసల నగలు, గవ్వలతో చేసిన దండలు, చేతిలో వెదురు బుట్ట, ముమ్మూర్తులా సోదెకత్తెలా రూపాంతరం చెందిన శ్రీనివాసుడు నారాయణపురం వైపు ప్రయాణం సాగించాడు.

నారాయణపురం చేరుకున్న సోదెకత్తె నగర వీధులలో ''సోదె చెప్తానమ్మా... సోదె చెప్తాను'' అంటూ తిరగసాగింది. రాజ మందిరం దగ్గరగా తిరుగాడుతున్న సోదెకత్తెను చూసిన పరిచారికలు ఆమె గురించి రాణి ధరణీదేవికి తెలియజేశారు.

రెండు రోజులుగా అన్నమూ, నీళ్లూ ముట్టకుండా మంచంపట్టిన పద్మావతికి ఏమయ్యిందో అర్థంకాని రాణి, సోదెకత్తె ద్వారా తెలుసుకోవచ్చునని అనుకుంది. దాసీ దానిని పంపి, సోదెకత్తెను తన మందిరానికి పిలిపించింది. యువరాణి పద్మావతి అనారోగ్యానికి కారణం ఏమిటో చెప్పమంది.

''కంచి కామాక్షి చెప్తది, మదుర మీనాక్షి చెప్తది, కాశీ విశాలాక్షి చెప్తది...'' అంటూ సోదె ప్రారంభించింది సోదెకత్తె.



పద్మావతి రాజదంపతులకు కూతురు కాని కూతురని చెప్పింది. ఆమె భూమిలో పుట్టిన పిల్ల అంది. కోయదొర వేషంలో వేటకు వచ్చి, తోటలో ప్రవేశించిన దివ్య పురుషుడిని చూసి వరించిందనీ, ఆ పురుషుడి వియోగాన్ని భరించలేకే బాధ పడుతోందని వివరించింది.

పద్మావతిని నీలమేఘశ్యాముడైన ఆ దివ్య పురుషుడికి ఇచ్చి వివాహం జరిపించమంది. అలా చేయకపోతే భూమిలో పుట్టిన పిల్ల భూమిలోకే పోతుందని హెచ్చరించింది.

ధరణీదేవి కానుకలు ఇచ్చి, సోదెకత్తెను పంపించి వేసింది. సోదెకత్తె వేషంలో వచ్చినపని ముగించిన శ్రీనివాసుడు వేంకటాచలానికి తిరిగి వెళ్ళిపోయాడు.

''సొదెకత్తె చెప్పినది నిజమేనా'' అని ధరణీదేవి పద్మావతిని చూసి అడిగింది. ''నిజమే.. ఆ నీలమేఘశ్యాముడు నా మనసును తొలిచూపులోనే వశం చేసుకున్నాడు. ఆ దివ్య పురుషునితో వివాహం జరిపించకపోతే నేను జీవించి ఉండలేన''ని కన్నీళ్ళు కారుస్తూ చెప్పింది పద్మావతి.

ధరణీదేవి సొదెకత్తె చెప్పిన విషయాలనూ, పద్మావతి అభిప్రాయాన్నీ భర్త ఆకాశరాజుకు వివరించింది. ''కొండ మీద ఉండే ఆ కోయ యువకుడు ఎవరో తెలుసుకుని, రాజ పురోహితులతో సంప్రదించి అమ్మాయి వివాహం జరిపించండి ప్రభూ..'' అంది.

''ఎవరో వచ్చి కన్యను ఇవ్వమని అడిగితేగానీ మనం కన్యాదానం చేయలేం. అడగకనే కన్యను ఇవ్వటం ఆచారం కాదు కదా..'' అన్నాడు ఆకాశరాజు.

నారాయణపురానికి బయలుదేరిన వకుళమాలిక ఆ పట్టణం పొలిమేరలోని శివాలయం చేరుకుంది. ఆమె వెళ్ళే సమయానికి పద్మావతి చెలికత్తెలు ఆలయంలో అర్చనలు చేయిస్తూ కనిపించారు. వకుళమాలిక వాళ్ళతో పరిచయం చేసుకుంది. అర్చనలు ఎందుకు చేయిస్తున్నారని ఒక చెలికత్తెను ప్రశ్నించింది.

''మా యువరాణి పద్మావతి జ్వరంతో మంచంపట్టింది. ఆమె ఆరోగ్యం కుదుటపడటానికి శాంతిపూజలు చేయిస్తున్నామ''ని చెప్పింది చెలికత్తె.

''నేను ఆకాశరాజు దంపతులతో ముఖ్యమైన పని ఉండి వచ్చాను. నాకు మీరు రాజదంపతుల దర్శనం చేయిస్తారా..'' అని వాళ్ళను అడిగింది వకుళమాలిక.



చెలికత్తెలు అందుకు సరేనని అన్నారు.

వకుళ మాలికను చెలికత్తెలు రాజదంపతుల సముఖానికి తీసుకుని వెళ్ళారు. వకుళమాలిక ఆకాశరాజు దంపతులకు శుభాకాంక్షలు తెలిపింది. ఆమె రాకకు కారణం అడిగాడు ఆకాశరాజు.

''మహారాజా.. నా పేరు వకుళమాలిక. నాకు కుమారుడితో సమానుడైన శ్రీనివాసుడికి కన్యను అన్వేషిస్తున్నాను. వేంకటాద్రిమీద నివాసం ఉన్న శ్రీనివాసుడు చూడచక్కనివాడు. అతను సామాన్య మానవుడు కాడు. దివ్యపురుషుడు. మీ కుమార్తె పద్మావతిని తోటలో చూసి తొలిచూపులోనే వరించాడు. నిద్రాహారాలుమాని ఆమె కోసం పరితపిస్తున్నాడు. సౌభాగ్యవతి పద్మావతిని శ్రీనివాసుడికి కన్యాదానం చేయండి'' అంది వకుళమాలిక.

ఆకాశరాజు శ్రీనివాసుడి కులగోత్రాల వివరాలు అడిగాడు. శ్రీనివాసుడు చంద్రవంశానికి ఛెందినవాడనీ, అతడిది వాసిష్ఠ గోత్రమనీ వివరించింది వకుళమాలిక. ఆకాశరాజు దంఫతులు వకుళమాలికకు అతిథి మర్యాదలు చేశారు.

పద్మావతిని శ్రీనివాసుడికి కన్యాదానం చేసేముందు, అతని గురించిన కొన్ని సందేహాలు నివృత్తి చేసుకోవడం మంచిదనిపించింది ఆకాశరాజుకు.

దేవగురువు, తమ మేలుకోరే విజ్ఞుడూ అయిన బృహస్పతి ఆచార్యుడిని ఆహ్వానించి, వెంటబెట్టుకు రమ్మని కొడుకు వసుదాసుడిని పంపించాడు.

ఆకాశరాజు ఆహ్వానాన్ని మన్నించి బృహస్పతి వేంచేశాడు. వేంకటాచల వాసుడైన శ్రీనివాసుడితో మా పుత్రిక పద్మావతి వివాహానికి ప్రతిపాదన వచ్చింది. ''మీ అభిప్రాయం సెలవీయండి'' అన్నాడు ఆకాశరాజు.

''ఆ విషయంలో శుక యోగీంద్రుడిని సంప్రదించటం మంచిది'' అన్నాడు బృహస్పతి.






## శుభలేఖ

బృహస్పతి సూచనను అనుసరించి ఆకాశ రాజు శుకమహర్షిని తీసుకురావడానికి తన తమ్ముడైన తొండమానుడిని పంపించాడు. తొండమానుడు సమీపంలో ఉన్న శుక మహర్షి ఆశ్రమానికి వెళ్ళి ఆయనను సగౌ రవంగా రథంమీద రాజధానికి తీసుకు వచ్చాడు.

శ్రీనివాసుడు పద్మావతిని పెళ్లాడదలచు కున్న విషయాన్నీ, పద్మావతి ఇష్టపడిన విషయాన్నీ శుకమహర్షికి విన్నవించాడు ఆకాశరాజు. ''కొండకోనల్లో నివసిస్తున్న శ్రీనివాసుడి గురించి తనకు ఏమీ తెలియ దనీ, పద్మావతిని అతడికి కన్యాదానం చేయ వచ్చునా'' అని శుకమహర్షిని అడిగాడు.

''శ్రీనివాసుడు ఎవరో కాదు, అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడనైన శ్రీమహా విష్ణువే. ఆ పురుషోత్తముడికి నీ కుమార్తెను అర్పించి, జన్మను చరితార్థం చేసుకో ఆకాశ రాజా..'' అన్నాడు శుకమహర్షి.

శ్రీనివాసుడు శ్రీహరే అని విన్న ఆకాశ రాజు ఆశ్చర్యం వ్యక్తం చేశాడు. భూలోకంలో మానవులను ఉద్ధరించడానికి మహావిష్ణువు వేంకటాద్రి శిఖరాన్ని చేరుకున్నాడని వివరిం చాడు శుకమహర్షి.

''నీ కుమార్తెగా నువ్వు భావిస్తున్న పద్మా వతి మహాలక్ష్మి అంశతో జన్మించిన పుణ్య వతి. గత జన్మలో ఆమె వేదవతి'' అన్నాడు బృహస్పతి ఆకాశరాజుతో.

''వేంకటాద్రి మీద శ్రీనివాసుడి ఆలనా పాలనా చూసుకుంటున్న వకుళమాత పూర్వజన్మలో కృష్ణుడిని ఒడిలో ఆడించిన యశోద'' అంటూ శుకమహర్షి వివరించాడు.

వక్కలంతం సూర్యనారాయణ రావు





ఆకాశరాజు ఆనందంతో, ఆశ్చర్యంతో కళ్లు పెద్దవిగా చేసి బృహస్పతినీ, శుకమహర్షినీ కలియజూశాడు.

''అందరూ కారణ జన్ములే'' అన్నాడు శుకమహర్షి. ''నువ్వు కూడా కారణజన్ముడివే ఆకాశరాజా. గతజన్మలో నువ్వు ఎవరో కూడా మాకు తెలుసు'' అంటూ బృహస్పతి చిరు నవ్వు నవ్వుతూ అన్నాడు.

ఆకాశరాజు కుతూహలంగా, వినయంగా చూశాడు. ''గురుదేవా.. నా పూర్వజన్మ గురించి తెలుసుకోవాలన్న కోరిక కలుగు తోంది'' అన్నాడు.

బృహస్పతి ''వినిపిస్తాను... విను'' అన్నాడు.

పూర్వం కాళహస్తి క్షేత్రంలో పురంధరుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి లేకలేక ఒక కొడుకు కలిగాడు. అతనిపేరు మాధ వుడు. సకల శాస్త్రాలు అభ్యసించి, యుక్త వయస్కుడయ్యాడు. చిత్రలేఖ అనే చక్కని కన్యను వివాహం చేసుకున్నాడు. కొంతకాలం అనంతరం శారీక వాంఛలకు దాసుడై పోయాడు. భార్య చేసిన హితోపదేశాన్ని పెడచెవినిపెట్టి, ధర్మం తప్పి ప్రవర్తించాడు. మద్యపానమూ, మాంసభక్షణమూ చేసి కులభ్రష్టుడైపోయాడు. తల్లిదండ్రులనూ, భార్యనూ వదిలి పెట్టి వెళ్లిపోయాడు. అనేక పాపాలు మూటగట్టుకున్నాడు.

ఏ స్త్రీ కోసం తన కులాన్నీ, ధర్మాన్నీ, నీతినీ త్యజించి పక్కకు వెళ్ళిపోయాడో ఆ స్త్రీ కాల క్రమాన చనిపోయింది. మాధవుడు దిక్కులేనివాడయ్యాడు. దేశద్రిమ్మరి అయిపోయాడు. ఉత్తరాదికి చెందిన రాజు పరివారంతో కలిసి, శేషాచలం యాత్రకు వెళ్తూ ఉంటే, చూసిన మాధవుడు వాళ్ళ వెంట వెళ్ళాడు. వాళ్ళు తినగా మిగిలిన ఎంగిలి మెతుకులు తింటూ వాళ్ళ వెన్నంటే వెళ్ళసాగేడు.

రాజు, పరివారము కపిలతీర్థ క్షేత్రములో తలనీలాలు తీయించుకున్నారు. వాళ్ళను అనుకరిస్తూ మాధవుడూ తన తల వెంట్రు కలు తీయించుకుని గుండు చేయించుకు న్నాడు. రాజ బృందం చనిపోయిన పెద్దలకు పిండ ప్రదానం చేసి, శ్రాద్ధ కర్మలు ఆచ రించారు. పిండ ప్రదానానికి అన్నమూ, ధాన్యమూ లేని కారణంగా మాధవుడు మట్టితో పిండాలు చేసి, మరణించిన తన పూర్వీకులకు శ్రాద్ధ కర్మలు చేశాడు.

యాత్ర చేస్తున్న రాజ బృందంతోబాటు శేషాచలాన్ని అధిరోహించాడు. పరమ పావనమైన శేషాచల పర్వతంమీద పాదం మోపగానే మాధవుడి పాపాలు కరిగిపోవడం ప్రారంభించాయి. మాధవుడి శరీరంలో నుంచి పుట్టిన అగ్ని అతడి పాపాలను దహించివేసింది. అతడు పర్వత శిఖరం చేరుకుని అక్కడ విశ్రమించాడు. బ్రహ్మదేవుడు అతని ముందు ప్రత్యక్షమయ్యాడు. ''మాధవా.. శేషాచల మహిమ నువ్వు చేసిన ఘోర పాపాలను దహించి వేసింది. పుష్కరిణిలో స్నానం చేసి వరాహ స్వామిని సేవించి నీ శరీరాన్ని వదిలిపెట్టు. భవిష్యత్తులో నారాయణపురం సుధర్ముడి కొడుకుగా నువ్వు జన్మిస్తావు. ఆ జన్మలో శ్రీమహాలక్ష్మి నీ కుమార్తెగా అవతరిస్తుంది. ఆమెను పెళ్ళాడి శ్రీమహావిష్ణువు నీకు అల్లుడౌతాడు అన్నాడు బ్రహ్మ. బ్రహ్మదేవుడు ఆజ్ఞాపించిన విధంగా మాధవుడు మరణించాడు'' అంటూ బృహస్పతి తన కథనం ముగించాడు.

''ఆకాశరాజా.. గత జన్మలో మాధవుడు మరెవరో కాదు, నువ్వే. నీ పాపాలను దహించిన కారణంతో శేషాద్రికి వేంకటాచలం అనే పేరు వచ్చింది సుమా'' అన్నాడు బృహస్పతి.

''నిజమా..'' అంటూ ఆశ్చర్యపోయాడు ఆకాశరాజు.

'వేం' అనే సంస్కృతాక్షరానికి 'పాపం' అని అర్థం. 'కటం' అనే పదానికి 'దహించివేసేది' అని అర్థం. 'వేంకటాచలం' అంటే 'పాపాలను దహించి వేసే పర్వతం' అని అర్థం. గత జన్మలో నీ పాపాలను దహించిన అనంతరం ఆ పర్వతం వేంకటాచలమనే పేరుతో ప్రసిద్ధి చెందిందని వివరించాడు శుక మహర్షి.



“గత జన్మలో మాధవుడు అయిన నీ గాథను శుకానందుడు జనక చక్రవర్తికి వినిపించాడు” అన్నాడు బృహస్పతి.

“శ్రీనివాసుడిని అల్లుడిగా చేసుకునే అంశంలో నా అనుమానాలన్నీ పటాపంచలయ్యాయి. పద్మావతిని ఆ శ్రీనివాస ప్రభువుకు కన్యాదానం చేస్తాను” అన్నాడు ఆకాశరాజు ఆనందంగా.

“మంచిది. ఆ నిర్ణయాన్ని లేఖద్వారా శ్రీనివాసుడికి అందజేయి” అన్నాడు బృహస్పతి.

“ఆ లేఖను నేనే స్వయంగా ఆ శ్రీనివాసుడికి సమర్పించి, తరిస్తాను” అన్నాడు శుకమహర్షి.



తమ కూతురు పద్మావతిని ఇచ్చి వివాహం జరిపించడానికి నిశ్చయించినట్టు ఆకాశరాజు శ్రీనివాసుడికి శుభలేఖ రాసి శుక మహర్షికి ఇచ్చాడు. “మహానుభావా, శుభలేఖను మా కాబోయే అల్లుడికి అందజేసి పుణ్యం కట్టుకోండి” అన్నాడు ఆకాశరాజు.

“ఆకాశరాజా.. వేంకటాద్రిమీద విడిది చేసిన వైకుంఠవాసుడికి శుభలేఖ అందజేయటం అనేది శుభప్రదమైన, విశిష్టమైన సేవ. ఆ సేవ చేసే అవకాశం లభించడం నా అదృష్టం” అన్నాడు శుకమహర్షి.

శుకమహర్షి వేంకటాద్రి చేరుకుని, శ్రీనివాసుడి నివాసానికి వెళ్ళాడు. పద్మావతితో ఆయన పరిణయం నిర్ణయించబడిన శుభ వర్తమానం చెప్పి, ఆకాశరాజు పంపిన లేఖను అందజేసాడు. ఆ లేఖను చదివిన శ్రీనివాసుడు సంతోషంతో పొంగిపోయాడు.

ఆమె రాయబారం సఫలమైనట్లు వకుళ మాతకు చెప్పాడు. శుక మహర్షికి అతిథి సత్కారాలు చేసి, ఆకాశరాజు పంపిన ఉత్తరానికి ప్రత్యుత్తరం వ్రాసి, శుకమహర్షికి అందించాడు. వివాహానికి శ్రీనివాసుడి సమ్మతిని ఆయన నోట చెప్పించుకుని విని, శుకమహర్షి ఆకాశరాజు పట్టణానికి తిరుగు ప్రయాణమయ్యాడు.

శుకుడు వెళ్ళిపోగానే శ్రీనివాసుడు వకుళమాతతో ఇలా అన్నాడు. “అమ్మా.. వధువు పద్మావతి వైపున తల్లిదండ్రులు ఉన్నారు. బంధువులున్నారు. మిత్రులున్నారు. శ్రేయోభిలాషులు ఉన్నారు. పరిజనం ఉన్నారు. ఆకాశరాజు చేత పాలింపబడుతున్న ప్రజలు ఉన్నారు. నాకేమో తల్లిదండ్రులు లేరు. అన్నదమ్ములు లేరు.



అక్కచెల్లెళ్లు లేరు. పరిజనమూ లేరు. నాకున్నదల్లా నువ్వూ, శ్వేత వరాహుడు.. మీరిద్దరే. మనం ముగ్గురమూ పెళ్ళికి వెళితే ఏ మాత్రం వైభవంగా ఉంటుంది” అన్నాడు.

నిరుత్సాహంగా పలికిన శ్రీనివాసుడి మాటలు విని వకుళమాలిక చిరునవ్వు నవ్వింది. “ఎంత అమాయకుడివి నాయనా.. సకల యుగాలలోని జీవులందరికీ తల్లివీ, తండ్రివీ నువ్వే కదా. తల్లికాని తల్లి నేనున్నాను కదా. బంధువులు లేరన్న విచారం నీకెందుకు.. బ్రహ్మ నీ కుమారుడే కదా. పరమశివుడు చుట్టమే కదా. ఇంద్రుడు మొదలైన దిక్పాలకులూ, ఇతర దేవతలూ నీ పరివారమే కదా. దేవతలందరూ దిగివస్తే ఇక నీ కళ్యాణ వైభవానికి కొరత ఏముంటుంది చెప్పు” అందామె.

“నేనిప్పుడు వైకుంఠ మందిరంలో లేను. ఇప్పుడు నేను పిలిస్తే వాళ్ళు వస్తారా..?” శ్రీనివాసుడు సందేహిస్తూ అన్నాడు.

“దివిని వదిలి భువికి దిగివచ్చినంత మాత్రాన నీ ప్రభావం తగ్గుతుందా, తండ్రీ నువ్వు ఎక్కడ ఉంటే అక్కడే వైకుంఠం. సందేహించకుండా బ్రహ్మాది దేవతలందరికీ వర్తమానం అందజేసి, వివాహానికి ఆహ్వానించు” వకుళమాలిక అంది.

“అందరినీ వివాహానికన్నా ముందుగానే ఇక్కడికి రమ్మని వర్తమానం పంపుతాను. వేంకటాద్రి మీదే కొన్ని రోజులు విడిదిచేసి, వివాహసన్నాహాలు పూర్తి చేసుకుని అనంతరం వధువు నగరానికి వెళ్దాం” శ్రీనివాసుడు సాలోచనగా అన్నాడు.

“దేవతలకు వర్తమానం ఎవరి ద్వారా అందజేస్తావు శ్రీనివాసా..?” వకుళమాలిక ప్రశ్నించింది.

“నా పర్యంకమైన ఆదిశేషుడూ, వాహనమైన గరుత్మంతుడూ ఉన్నారుగా, అమ్మా..” శ్రీనివాసుడు చిరునవ్వుతో అన్నాడు.

కళ్లు అరమూసి, ఏదో సంకల్పించాడు శ్రీనివాసుడు. మరుక్షణం ఆదిశేషుడూ, గరుత్మంతుడూ ఆయన ముందు సాక్షాత్కరించారు. ఇద్దరూ తమ స్వామికి ప్రదక్షిణ నమస్కారాలు చేశారు.





# శ్రీనివాస కల్యాణం - 7

## పెండ్లి సన్నాహం

"స్వామీ, ఇంతకాలానికి మామీద దయ కలిగింది. ఆజ్ఞాపించండి" అన్నాడు గరుత్మంతుడు.

"గరుడా! ఆకాశరాజు కూతురు పద్మావతితో మా వివాహం నిశ్చయమైంది. సత్యలోకానికి వెళ్ళు. మా పుత్రుడు బ్రహ్మను సకుటుంబంగా, సపరివారంగా రమ్మని మామాటగా చెప్పు" అన్నాడు శ్రీనివాసుడు.

"ఆజ్ఞ" అంటూ గరుత్మంతుడు ఆకాశంలోకి ఎగిరాడు.

ఆదిశేషుడు వినయంగా శ్రీనివాసుని వైపు చూశాడు. "స్వామీ! ఆజ్ఞాపించండి! పర్యంకసేవా?"

"కాదు ఆదిశేషా! నువ్వు వెంటనే కైలాసానికి వెళ్ళు. నాగభూషణుడైన పరమశివుణ్ణి దర్శించు. మా వివాహానికి ఆహ్వానించి, తీసుకురా! కైలాస కుటుంబమంతా ఆ రోజు ఇక్కడికి కదలి రావాలని విన్నవించు!" అన్నాడు శ్రీనివాసుడు.

ఆదిశేషుడు వినయంగా తల ఊపి బయలుదేరాడు.

"నాయనా, శ్రీనివాసా! అష్టదిక్పాలకులను మరచిపోయావు!" అంటూ గుర్తు చేసింది వకుళమాలిక.

"బ్రహ్మ అందరినీ వెంటబెట్టుకు వస్తాడమ్మా. సపరివారంగా రమ్మన్నాను కదా. దిక్పాలకులనూ, గంధర్వులనూ, కిన్నెరులనూ అందర్నీ తీసుకువస్తాడు," అంటూ బదులిచ్చాడు శ్రీనివాసుడు.

శ్రీనివాసుడు ఊహించినట్లుగానే బ్రహ్మ సమస్త దేవతలనూ వెంటబెట్టుకుని వేంకటాచలానికి వచ్చాడు. అందరూ బృందాలు, బృందాలుగా శ్రీనివాసుడికి నమస్కారాలు అర్పించారు. ఆయన అందర్నీ ఆప్యాయంగా పలుకరించాడు.

వక్కంతం సూర్యనారాయణ రావు





"కుమారా, ఈ సాధ్వి వకుళమాలిక. ఈ అవతారంలో ఇక్కడ నాకు తల్లి. కృష్ణావతార సమయంలో యశోద" అన్నాడు శ్రీనివాసుడు వకుళమాలికను పరిచయం చేస్తూ.

బ్రహ్మ "పితామహికి ప్రణామాలు" అంటూ వకుళమాతకు నమస్కరించాడు.

దేవతలమధ్య చేతులు జోడించి నిలుచున్న దేవశిల్పి విశ్వకర్మను తన సమీపానికి పిలిపించుకున్నాడు శ్రీనివాసుడు.

"విశ్వకర్మా, మా వివాహానికి దేవతలూ, మునులూ ఎందరు వచ్చారో చూశావు కదా! వాళ్లందరూ హాయిగా విడిది చేయడానికి అనువైన సౌకర్యాలు కలిగిన మందిరాన్ని ఇక్కడ నిర్మించు" అన్నాడు విశ్వకర్మను ఆజ్ఞాపిస్తూ శ్రీనివాసుడు.

విశ్వకర్మ అతిథులందరూ విశ్రమించడానికి వీలుగా సకల సదుపాయాలతో ఒక మందిరాన్ని తన సంకల్ప మంత్రంచేత నిర్మించాడు. దేవతలూ, ఋషులూ ఆ మందిరంలో విడిది చేశారు.

ఆ తరువాత శ్రీనివాసుడు అగ్ని దేవుడిని పిలిచి "అగ్నిహోత్రా, నీ భార్యలయిన స్వాహాదేవి, స్వధాదేవి సహకారం తీసుకుని అతిథులు ఆరగించడానికి రుచికరమైన వంటలు వండు" అన్నాడు.

అగ్ని అందుకు సమ్మతించాడు. శ్రీనివాసుడు అదే విధంగా కొందరు దేవపురుషులను ఎంపికచేసి, వాళ్ళకు పనులు అప్పగించాడు. అందరికీ నీళ్ళు అందివ్వడానికి వరుణుడిని నియమించాడు.

పరిమళ ద్రవ్యాలు సమకూర్చి, అందరికీ పంచే పనిని వాయుదేవుడికి అప్పగించాడు. వంట సామగ్రినీ, నీటి పాత్రలను శుభ్రం చేసే పనికి నవగ్రహాలను నియమించాడు.

శాస్త్రోక్త ప్రకారం వివాహసంబంధమైన ప్రాథమిక కార్యాలను నిర్వహించమని బ్రహ్మను ఆదేశించాడు శ్రీనివాసుడు.

"ఓం ప్రథమంగా మంగళస్నానం చేయాలి. అనంతరం ఇష్టదేవతలను ఆరాధించాలి. తదనంతరం కులదేవతను ప్రతి

ష్టించాలి'' అన్నాడు బ్రహ్మ. అది వినగానే శ్రీనివాసుడికి తన ధర్మపత్ని శ్రీమహాలక్ష్మి గుర్తుకు వచ్చింది.

''కుమారా, మనమందరం నిండుగా ఉన్నప్పటికీ ఈ సభా మందిరంలో కళ లేదు. శ్రీలక్ష్మి లేని చోట కళ ఉండదు సుమా!'' అన్నాడు శ్రీనివాసుడు.

లక్ష్మిని తలచుకుని విచారిస్తున్న శ్రీనివాసుడిని పరమశివుడు ఓదార్చాడు.

''నేను వెళ్ళి మాతను వెంటబెట్టుకు వస్తాను, ఆనతి ఇవ్వాలి'' అన్నాడు బ్రహ్మదేవుడు.

శ్రీనివాసుడు ఆయనను వారించి, సూర్యభగవానుని తన సమీపానికి పిలిచాడు.

సూర్యుడు దగ్గరగా వచ్చి, చేతులు జోడించి నిలుచున్నాడు.

''సూర్యా! ఈ ఆనంద సమయంలో ఆదిలక్ష్మిలేని కొరత కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది. శృగాల వాసుదేవుడి నగరమైన కరవీరపురానికి దగ్గరగా లక్ష్మి తపస్సులో ఉంది. మా వివాహానికి ఆమెను ఆహ్వానించి, తీసుకురా!'' అన్నాడు శ్రీనివాసుడు.

తన భర్తకు జరిగే పునర్వివాహానికి శ్రీమహాలక్ష్మి వస్తుందా? అన్న సందేహం కలిగింది సూర్యుడికి. ఆమాటే పైకి అన్నాడు.

శ్రీనివాసుడు చిరునవ్వు నవ్వాడు. ''పద్మావతితో మా వివాహం త్రేతాయుగంలో సంకల్పించినదే సుమా! ఈ వివాహం జరగడానికి వీలుగా, శ్రీలక్ష్మి అలిగి వెళ్ళిపోయింది! శుభవార్త వినిపించి నువ్వు ఆహ్వానించగానే ఆమె ఉత్సాహంగా నీ వెంట వస్తుంది.



వెళ్ళు!'' అన్నాడు. సూర్యభగవానుడు కరవీరపురం దారిపట్టాడు...

శ్రీ మహాలక్ష్మి చిరునవ్వులు చిందిస్తూ, సూర్యుడి వెంట వచ్చింది. శ్రీనివాసుడి పాదాలకు నమస్కరించింది.

శ్రీనివాసుడు ఆమెను సాదరంగా ఆహ్వానించి తన సమీపంలో కూర్చోబెట్టుకున్నాడు. ఆమెతో అనునయ వాక్యాలు పలికాడు.

''దేవీ! రామావతార సమయాన నువ్వు నాతో చెప్పిన సంగతి గుర్తుందా?'' అని లక్ష్మిని అడిగాడు శ్రీనివాసుడు.

''ఎందుకు గుర్తులేదు! వేదవతిని పరిణయమాడమని ఆనాడు నేను మీకు విన్నవించాను కదా,'' అంది లక్ష్మి చిరునవ్వుతో.

''ఆనాటి వేదవతే నేటి పద్మావతి'' శ్రీనివాసుడు చిరునవ్వుతో చెప్పాడు.

''ఆ మాత్రం నాకు తెలీదనుకున్నారా? భృగువుమీద నెపంవేసి, నేను అలిగి వెళ్ళిపోయింది ఎందుకనుకున్నారు? పక్కనే నేనుంటే మీరు పద్మావతిని చేరదీయరన్న అనుమానంతోనే వెళ్ళిపోయాను'' అంది ఆదిలక్ష్మి నవ్వుతూ.

''అయితే, శ్రీనివాసుడికి మంగళ స్నానం నువ్వే చేయించు తల్లీ!'' అంది లక్ష్మితో వకుళమాలిక.

''దివ్య పరిమళ తైలంతో నేనే నా నాథుడికి తలంటుతాను'' అంది లక్ష్మి ఆనందంగా నవ్వుతూ.

లక్ష్మి తన హృదయేశ్వరుని మంగళ స్నానానికి పూర్వరంగంగా పరిమళ తైలంతో తలంటింది.

వివిధ పావన తీర్థాలనుంచీ వరుణుడు సేకరించి తెచ్చిన స్వచ్ఛమైన జలాలతో శ్రీనివాసునికి ముత్తయిదువలు మంగళ స్నానం చేయించారు.

ఆ కార్యక్రమానికి సరస్వతీ, పార్వతీ నేతృత్వం వహించారు. కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు తదితర మహర్షులకు శ్రీనివాసుడు నమస్కారాలు చేశాడు.

ముత్తయిదువలు శ్రీనివాసుడిని వరుడిగా వస్త్రాలతో, ఆభరణాలతో అలంకరించారు. శ్రీనివాసుడు బ్రహ్మదేవుడి ఆధ్వర్యంలో పుణ్యాహవచనం చేశాడు. అనంతరం అష్టవర్గు అనే వివాహసంబంధమైన కార్యక్రమం నిర్వర్తించాడు.

తదనంతరం కులదేవత ప్రతిష్ఠాపన చేయాలన్నాడు వశిష్ఠ మహర్షి. అందుకు సమాధానంగా తన కులదేవత శమీవృక్షం అని చెప్పాడు శ్రీనివాసుడు.




పుష్కరిణీ ఉత్తర దిశలో ఉన్న కుమార తీర్థం వద్దనుండీ శమీవృక్షశాఖను శాస్త్రోక్త విధానంలో శ్రీనివాసుడు స్వయంగా తీసుకువచ్చాడు.

మహర్షుల సూచన మేరకు, వరాహస్వామి అనుమతితో ఆయన సన్నిధిలో తన కులదేవత అయిన శమీవృక్ష శాఖను శ్రీనివాసుడు ప్రతిష్ఠించాడు. బ్రహ్మ ఆధ్వర్యంలో కులదేవతను అర్చించాడు.

పూజలన్నీ పూర్తి అయిన తరువాత శ్రీనివాసుడు బ్రహ్మతోనూ, పరమశివుడితోనూ ప్రత్యేకంగా సమావేశం అయ్యాడు.

''వివాహానికి అవసరమైన ధనము నా వద్ద లేదు. కర్తవ్యం ఆలోచించండి'' అన్నాడు వాళ్ళతో శ్రీనివాసుడు.

''అప్పుచేసి వివాహం చేసుకోవడం శాస్త్ర సమ్మతమే...'' అన్నాడు పరమశివుడు సాలోచనగా.

''ధనాధిపతి కుబేరుడున్నాడు. అతని వద్ద ఋణంగా తీసుకుంటే, కార్యం జరిగిపోతుంది కదా!'' అన్నాడు బ్రహ్మ.

పరమేష్ఠీ, పరమేశ్వరుల అభిప్రాయాలు తెలియగానే శ్రీనివాసుడు కుబేరుడిని సముఖానికి పిలిపించుకున్నాడు.

''కుబేరా, మా వివాహానికి ధనం అవసరమైంది. నువ్వే అప్పుగా సమకూర్చాలి సుమా!'' అన్నాడు శ్రీనివాసుడు.

''ఋణపత్రం వ్రాసి ఇస్తే వడ్డీకి ఋణంగా సొమ్ములు ఇస్తాను'' అన్నాడు కుబేరుడు.

కలియుగంలో విలంబినామ సంవత్సరం, వైశాఖమాసం, శుక్లపక్ష సప్తమి తిథి అయిన ఆనాడు శ్రీనివాసుడు స్వహస్తాలతో కుబేరుడికి ఋణపత్రం రాసి ఇచ్చాడు.

తరవాత బ్రహ్మ, శివుడు ఆ పత్రంలో సాక్షి సంతకాలు చేశారు. ఈ ఘటనకు మూడవ సాక్షిగా అక్కడ ఉన్న అశ్వత్థ వృక్షాన్ని ఎన్నిక చేశారు.

పత్రంలో పేర్కొన్న విధంగా పద్నాలుగు లక్షల మాడల ధనాన్ని కుబేరుడు శ్రీనివాసుడికి అప్పుగా ఇచ్చాడు.





# శ్రీనివాస కల్యాణం - 8

## కల్యాణం

కుబేరుడు అప్పుగా ఇచ్చిన పధ్నాలుగు లక్షల శ్రీరామ ముద్రలున్న మాడలను శ్రీనివాసుడు కుబేరునికే ఇచ్చి వివాహానికి వ్యయం చేయమన్నాడు.

కుబేరుడు వంటకు అవసరమైన సామగ్రిని పెద్దమొత్తంలో కొని తెప్పించాడు.

వంటపనికి నియోగింపబడిన అగ్నిదేవుడు అవసరమైన పాత్రలు లేవన్నాడు.

వివాహానికి ఆహుతులై విచ్చేసిన దేవ, గంధర్వ, కిన్నెర, కింపురుష, మహర్షి బృందాలను దృష్టిలో ఉంచుకుని వండటానికి శ్రీనివాసుడు అగ్నికి ఒక ఉపాయం చెప్పాడు.

''అగ్నీ. పుష్కరిణిని పాత్రగా చేసుకుని అందులో అన్నం వండు. పాపవినాశిని తీర్థంలో పప్పు, ఆకాశగంగా తీర్థంలో బెల్లం పరమాన్నమూ, దేవతీర్థంలో కూర, తుంబురు తీర్థంలో పులిహోర, కుమార తీర్థంలో వివిధ రకాల పిండివంటలు, పాండు తీర్థంలో చారు, ఇతర తీర్థాలలో కందమూల ఫలాలతో చేసే కూరలూ వండు'' అన్నాడు శ్రీనివాసుడు.

శ్రీనివాసుడి మహిమతో ఆ తీర్థాలన్నీ భారీస్థాయి వంటపాత్రలుగా రూపాందాయి. అగ్నిదేవుడు సతీసమేతంగా ఆరు రుచులతో కూడిన ఆహార పదా

వక్కంతం సూర్యనారాయణ రావు





ర్థాలను సిద్ధం చేశాడు. అగ్నిదేవుడు అటు పిమ్మట శ్రీనివాసుడిని దర్శించుకుని ఇలా అన్నాడు. ''చిత్రాన్నం, దధ్యోజనం, తేనెతో పరమాన్నం, రకరకాల భక్ష్యాలు, అప్పాలు, కూరలు చక్కగా వండి సిద్ధం చేశాను.''

వివాహానికి విచ్చేసిన వారిని అందరినీ భోజనం ఆరగించమని ఆహ్వానించాడు శ్రీనివాసుడు. అప్పుడు బ్రహ్మ ''శ్రీనివాసా.. భగవంతుడికి నివేదించకుండా భోజనం చేయడం అపచారం కదా.. నీ వివాహ సంబంధమైన స్నాతకంలో ఆహారాన్ని ఎవరికి నైవేద్యంగా సమర్పించాలో తోచకుండా ఉంది. మీరే సెలవియ్యాలి'' అన్నాడు.

''ఘన నైవేద్యాన్ని స్వీకరించే అర్హత కలిగిన మహా నైవేద్య భోక్త ఉన్నారు కదా, కుమారా..'' అన్నాడు శ్రీనివాసుడు చిరునవ్వుతో.

''మహా నైవేద్యభోక్త.. అతడు ఎవరు జనకా..'' అన్నాడు బ్రహ్మ.

''ఇంకెవరు చతుర్భుజా.. అహోబిల మహాబలుడు నరసింహదేవుడు'' శ్రీనివాసుడు చిరునవ్వుతో అన్నాడు.

బ్రహ్మదేవుడు అహోబిల నరసింహ స్వామిని ఆహ్వానించాడు. ఆయనకు శాస్త్ర సమ్మతంగా అర్పించి, ఆహార పదార్థాలన్నింటినీ నివేదన చేశాడు.

దేవతలూ, మహర్షులూ, గంధర్వులూ... ఇతరులూ బారులుతీరి కూర్చున్నారు. అష్టదిక్పాలకులైన ఇంద్రుడు, అగ్ని, యమధర్మరాజు, నిర్వతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు అందరికీ లోటు లేకుండా వడ్డించారు.

అహూతులందరూ భుజించిన అనంతరం శ్రీనివాసుడు బ్రహ్మనూ, పరమేశ్వరుడినీ, లక్ష్మినీ, దిక్పాలకులనూ, అగ్నినీ, ఆదిశేషుడినీ, గరుత్మంతుడినీ సహపంక్తిలో ఉంచుకుని, అందరితో కలిసి భోజనం చేశాడు.

ఆ రాత్రి అందరూ వేంకటాద్రి మీదనే విశ్రమించారు. మరుసటి ఉదయం వధువు పట్టణం అయిన నారాయణ



పురం బయలుదేరి వెళ్ళేందుకు నిర్ణయం జరిగింది.

మరునాటి ఉదయం శ్రీనివాసుడు సకల దేవతా సమూహంతో కలిసి ఆకాశ రాజు పట్టణానికి పయనం కట్టాడు. తన వాహనం అయిన గరుత్మంతుడిని అధిరోహించాడు శ్రీనివాసుడు.

బ్రహ్మదేవుడు తన తెల్లహంస వాహనం ఎక్కాడు. శివుడు నందీశ్వరుడిని అధిరోహించాడు. ఇంద్రుడు ఐరావతం అనే నాలుగు దంతాల ఏనుగునూ, అగ్ని దేవుడు పొట్టేలునూ ఎక్కారు.

యమధర్మరాజు పౌండ్రకం అనే పేరు కలిగిన మహిషాన్ని అధిరోహించాడు. వరుణుడు జలధి అనే మొసలివాహనం మీద బయలుదేరాడు. కుబేరుడు భయంకరాకారుడైన నరవాహనం ఎక్కాడు.

వాయువు జింకను అధిరోహించాడు. నైరుతి తన గార్దభ వాహనంమీద బయలుదేరాడు.

ఇతర దేవతా స్వరూపులైన గంధర్వులూ, విద్యాధరులూ, కిన్నెరలూ, కింపురుషులూ అందరూ తమ తమ వాహనాలపై శ్రీనివాసుడిని అనుసరించారు.

వేంకటాద్రి నుంచి బయలుదేరిన ఆ దేవ పరివారం అందరికీ కనువిందు చేస్తూ కదిలింది. నవగ్రహదేవతలైన సూర్యుడు, చంద్రుడు, కుజుడు, బుధుడు, గురువు, శుక్రుడు, శని, రాహువు, కేతువు తమ తమ దివ్య రథాలను అధిరోహించి బయలుదేరారు. దేవతా స్త్రీలందరూ తమ భర్తల వాహనాలమీద కూర్చున్నారు.

మార్గమధ్యంలో ఉన్న పద్మ తీర్థం అనే మహా పుష్కరిణిని తన పరివారంతో సమీపించాడు శ్రీనివాసుడు. ఆ పుష్కరిణి సమీపంలో ఉన్న శుకయోగ ఆశ్రమాన్ని సందర్శించాడు.

శుకమహర్షి భక్తి శ్రద్ధలతో అందజేసిన ఆతిథ్యాన్ని స్వీకరించి, పరివారంతో పాటు ఆయనను కూడా వెంటేసుకుని నారాయణపురంవైపు తన మహా ప్రయాణాన్ని కొనసాగించాడు.

నారాయణపురంలో అంతఃపుర స్త్రీలు పద్మావతిని పెండ్లి కుమార్తెగా అలంకరించారు. పందిళ్ళతో, తోరణాలతో నగరాన్ని అందంగా అలంకరించారు. సకల దేవతల సాక్షిగా జరగనున్న ఈ వివాహానికి నవరత్నాలతో అద్భుతమైన మండపాన్ని నిర్మించారు మహాశిల్పులు.

వధువుగా అలంకరించబడిన పద్మావతిని ఏనుగుమీద కూర్చుండబెట్టి, పరివార సమేతంగా, మంగళ వాద్యాలతో శ్రీనివాసుడికి ఎదురుగా తీసుకువెళ్ళారు ఆకాశరాజు దంపతులు.

ఎదురుకోలు అనే వివాహసంబంధమైన కార్యక్రమంలో వధూవరులైన పద్మావతీ శ్రీనివాసులు ఒకరినొకరు చూసుకున్నారు.

అప్పుడు ఆకాశరాజు దంపతులను నారదుడు శ్రీనివాసుడికి పరిచయం చేశాడు.

నారాయణపురం ద్వారం వద్ద ఉన్న ఆలయంలో దుర్గను శ్రీనివాసుడూ, పద్మావతీ దర్శించి, అర్చనలు చేశారు. తమ వివాహం నిర్విఘ్నంగా జరిగేలా దీవించమని ఇద్దరూ జగన్మాత అయిన దుర్గను వేడుకున్నారు.

అనంతరం ఆకాశరాజు వధూవరులను నారాయణ పుర వీధులలో ఊరేగించాడు. పుర స్త్రీలు వధూవరుల మీద అక్షరాలూ, పేలాలూ, పుష్పాలూ వర్షించారు.

వధూవరుల అతిలోక సౌందర్యం పురజనులకు నేత్రపర్వం చేసింది. మహ







ర్షులు పఠిస్తున్న వేద మంత్రాల ఘోష, మంగళవాయిద్యాల శ్రావ్యమైన శబ్దాలతో శృతి కలిపింది.

నవ రత్నాలతో, పుష్పాలతో మనోహరంగా అలంకరించబడిన విడిది గృహంలో శ్రీనివాసుడు తన దేవతా పరివారంతో విడిది చేశాడు.

ఆకాశరాజు సోదరుడు తొండమాన్ చక్రవర్తి ఆధ్వర్యంలో వరుని పరివారానికి విందు భోజనం అందజేయబడింది.

ఆ రాత్రి గడచి తెల్లవారింది. అది శుక్రవారం. దశమ తిథి. ఆ రాత్రి పదమూడు ఘడియలకు సుమూహర్తం అయినందువల్ల, పగలంతా వివాహపూర్వ కార్యక్రమాలు శాస్త్రోక్తంగా జరిగాయి. సాయంత్రం కాగానే ఆకాశరాజు బంధుమిత్ర పరివార సమేతంగా విడిదికి వెళ్లి, శ్రీనివాసుడిని కళ్యాణ మండపానికి సవినయంగా ఆహ్వానించాడు.

ధరణీదేవి కాబోయే అల్లుడికి వశిష్ట మహర్షి సూచన మేరకు ఉపచారాలు చేసింది. శ్రీనివాసుడు తన పరివారం వెంటరాగా, రాజ నగరులోని కళ్యాణ మండపానికి విచ్చేశాడు.

పురోహితుని సూచనను అనుసరించి ఆకాశరాజు స్వామి పుష్కరిణి తీర్థంలో శ్రీనివాసుడి పాదాలను కడిగాడు.

వరుని కాళ్ళు కడగటానికి ధరణీదేవి నీళ్ళుపోస్తూ ఉంటే, పురుషసూక్తం పఠిస్తూ ఆయన పాదాలను కడిగాడు.

కన్యాదాన సమయంలో ఆయన శ్రీనివాసునికి వజ్రకిరీటాన్నీ, కంఠాభరణాలనూ, కేమందాలనూ, భుజకీర్తులనూ, వజ్రకంకణాలనూ, బంగారు మొలనూలునూ, రత్నాలు చెక్కిన పాదుకలనూ బహూకరించాడు.

మాంగల్య ధారణకు ముందుగా దేవగురువు బృహస్పతి పద్మావతి ప్రవరను ఈ విధంగా పఠించాడు.

"అత్రి గోత్రంలో జన్మించినదీ, సువీరుని మునిమనుమరాలూ, సుధర్ముని మనుమరాలూ, ఆకాశరాజు పుత్రికా అయిన సౌభాగ్యవతి పద్మావతిని స్వీకరించు."

అదే విధంగా వశిష్ఠ మహర్షి శ్రీనివాసుని ప్రవరను పఠించాడు.

''వసిష్ఠగోత్రోద్భవుడూ, యయాతి మునిమనుమడూ, శూరసేనుని మనుమడూ, వసుదేవుని పుత్రుడూ అయిన శ్రీనివాసునకు సౌభాగ్యవతి పద్మావతిని స్వీకరిస్తున్నాం.''

తదనంతరం ఆకాశరాజు శ్రీనివాసుని చేతికి కంకణం కట్టాడు. పద్మావతి చేతికి బృహస్పతి కంకణం కట్టాడు.

వేదమంత్రాలతో పవిత్రం చేయబడిన మంగళసూత్రాన్ని శ్రీనివాసుడు పద్మావతి మెడలో కట్టాడు. వశిష్ఠ మహర్షి వేదోక్తంగా వధువు పద్మావతిచేత లాజ హోమం చేయించాడు.

దేవతలూ, మహర్షులూ, బంధుమిత్రులూ అందరూ నవరత్నాలు కలిపిన అక్షింతలనూ వధూవరుల శిరస్సుల మీద వర్షించారు.

మాంగల్యధారణ అనంతరం వధూవరులను రత్న సింహాసనంమీద ఆసీనులను చేశారు. ఆకాశరాజు పాలగిన్నెను చేతిలో ఉంచుకుని, అల్లుడిని పూజించాడు.

వధువు పద్మావతి నాభిని పాలతో తుడిచి, శ్రీనివాసుని మాతృమూర్తి స్థానంలో ఉన్న వకుళమాలికకూ, శ్రీమహాలక్ష్మికీ అప్పగింతలు చేశారు ఆకాశ రాజు దంపతులు.

వకుళమాలిక ఒక యుగానంతరం తన కోరిక తీరటంతో ఆనందబాష్పాలు రాల్చింది.

వధూవరుల వేషభూషణాలతో అప్రాకృతమైన దివ్య సౌందర్యంతో, కిరీటాలతో, పూలమాలలతో కళ్ళకు విందు చేస్తున్న శ్రీ పద్మావతీ శ్రీనివాసులమీద దేవతలూ, మహర్షులూ పుష్పవృష్టి కురిపించారు.

(శుభం)

